9.6.1995 శుక్రవారం 24 పేజీలు సంపుటి:67 సంచిక:23 విడి ప్రతి: రూ.2.00లు

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. HNL 18



## తలవంచని రాజకీయ యోధుడు ఆనం వెంకటరెడ్డి!

# ఆనం వంశంలో ఒక శకం సమాప్తం!



ఆనం వెంకట రెడ్డి గారు మరణించారు. ఆరు దశాబ్దాలుగా జిల్లా రాజకీయాలలో ప్రాభవం తగ్గకుండా వెలు గొందుతున్న ఆనం కుటుంబంలో పాత తరం పెద్ద తలకాయ రాలిపోయింది; ఒక శకం అంత రించింది.

5 తేది, సోమవారం ఉదయం 10 గంటల సమయంలో ప్రశాంతంగా కన్ను మూశారాయన. స్నానం చేసి వచ్చి మంచం మీద నడుం వాల్చారట. నిద్ర పోతున్నా రనుకొన్నారు. కాని, అదే దీర్ఘ నిద్ర అని కొంత సేపటికి కాని తెలియ లేదు. అంత ప్రశాంతంగా మృత్యువును ఆహ్వానించి, పరలోక గతుడు కావడం ఎంత అదృష్టం?

ఆనం కుటుంబంలో వెంకట రెడ్డి గారిది విశిష్టమైన స్థానం. స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి గారికి స్వయాన తమ్ముడు ఆయన. ఊహ తెలిసి నప్పటి నుంచి ఎసికి రాజకీయాలలో చేదోడు, వాదోడుగా వుండిన వాడు. ఆనం కుటుంబపు ప్రాభవం నెల్లూరు టౌన్ పరిధులు దాటి జిల్లా వ్యాప్తం కావడంలో వెంకట రెడ్డి గారి కృషి నిరుప మానమైనది. గ్రామ గ్రామం తిరిగి, క్రింది స్థాయిలో అనుచరులను తయారు చేసి, ఎసికి అప్పగించే బాధ్యత ఆయనది. ఆ రోజుల్లో పంచాయితీలు, సహకార సంస్థల ఎన్నికలంటే కిడ్నాప్‌లు, బల ప్రయోగాలు, క్యాంపులు తప్పేవి కావు. వాటి బాధ్యత అంతా వెంకట రెడ్డి గారిదే. వెంకట రెడ్డి గారు రాత్రీ పగలు కష్ట పడి వేదిక కట్టి, జన సమీకరణ చేస్తే ఎసి దాని పై ఎక్కి ప్రసంగించే వారు. వెంకట రెడ్డి గారు గ్రామాల నుంచి నాయకులను తరలించుకొని వస్తే ఎసి వారి భుజం పై చెయ్యి వేసి మైమర పించేవారు. సుశిక్షితుడైన సైనికుడి వలె ముప్పయ్యేళ్ల పాటు ఎసి రాజకీయ ప్రాభవానికి నిశ్శబ్దంగా గ్రౌండ్ వర్క్ చేసిన వారాయన. పదవు లాశించి, అధికారం కోసం తాపత్రయపడి కాకుండా, అన్నకు విధేయుడైన తమ్ముడిగా సేవ చేశారు.

**ఎప్పుడూ ఎవర్నీ అనుసరించలేదు-**
**ఎప్పుడూ ఎవరికీ భయపడలేదు!**

ఈ ఓర్పే ఆయన్ను చాలా కాలం పదవులకు దూరంగా వుంచింది. వెంకట రెడ్డి గారికి తొలి పదవి లభించింది 54 ఏళ్ల ముదుసలి ప్రాయంలోనే! ఆయన శాసన సభ్యుడుగా గెల్చే టప్పటికి షష్టి పూర్తి దాటి రెండే ళ్లయ్యింది; మంత్రిత్వం హోదాకు ఎదిగింది ఆ తర్వాతే!

ఎసి రాజకీయ ఔన్నత్యం, తమ కుటుంబ ప్రాభవాల కోసం దాదాపు 35 ఏళ్లు నిశ్శబ్దంగా కృషి చేసి నప్పటికీ; 1967లో ఎసి చనిపోయిన తర్వాత ఎసికి వారసుడిగా గుర్తింపు పొందలేక పోయారు. ఆ అవకాశం ఆనం సంజీవ రెడ్డి గారికి లభించింది. పదవుల పట్ల ఆయనకు పెద్దగా లక్ష్యం లేదనడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

వెంకట రెడ్డి గారిలోని మరొక విశిష్ట లక్షణం - మొండి తనం! పెద్దగా చదువుకోక పోయినా, సిద్ధాంతాలు, ఆదర్శాలు, ఆశయాలు వంటి పట్టింపు లేవీ లేకపోయినా తాను నమ్మింది ఆచరించే పట్టుదల, మొండి తనం, దృఢ చిత్తం వెంకట రెడ్డి గారిలో వున్నాయి. జై ఆంధ్ర ఉద్యమంలో ఆయన ప్రదర్శించిన తెగువ, ధైర్య సాహసాలు అనితర సాధ్యమైనవి. ఆనాడు రాష్ట్ర మంతా జై ఆంధ్రా నినాదాలు మార్మోగు తుండినాయి. లక్షలాది ప్రజలు పూనకం వచ్చిన వారి వలె ప్రత్యేకాంధ్ర కోసం వీధుల్లోకి వచ్చి వుండినారు. ఉద్యమం

కొరవ 20 పేజీలో

# చీమ చిటుక్కుమంటే షేర్ మార్కెట్ ఉలిక్కి పడుతూంది!

భారతీయ షేర్ మార్కెట్ పోకడలు రాను రాను ఆందోళన కల్గిస్తున్నాయి. షేర్ ఇండెక్స్‌కు ఏ మాత్రం కొలుకునే సూచనలు కన్పడటం లేదు. 3400 పాయింట్ల వద్ద తారాడుతూంది. కొద్దో గొప్పో పెరిగే పాయింట్లు - షేర్ మార్కెట్ ఆరోగ్య సూచికలు కావు. అది కేవలం బ్రోకర్లను లాభ పరిచే పెరుగుదల. గత పదిహేను రోజులలో వచ్చిన మార్పుల వల్ల అదే జరిగింది. బ్రోకర్లు బాగు పడ్డారు; ఇన్వెష్టర్లు నష్టపోయారు. ఉదాహరణకు రిలయన్స్ షేర్‌నే తీసుకొందాం. ఈ పదిహేను రోజులలో అది రు 270 ల నుంచి రు. 289 లకు పెరిగింది. దాన్ని తిరిగి అమ్మాలంటే బ్రోకర్‌కు 3 శాతం కమిషన్. అంటే - 16 రూపాయలు చెల్లించాలి. దీనివల్ల ఇన్వెష్టర్‌కు లాభం ఏముంది? ఇండెక్స్‌లో స్వల్ప మార్పుల వల్ల [illegible], రిలయన్స్, బజాజ్ ఆటో, టిస్కో వంటి పెద్ద కంపెనీల షేర్లతో వ్యాపారం చేసే వారికి మాత్రమే ప్రయోజనం. ఇటు వంటి బ్లూచిప్ కంపెనీల షేర్లు ధనవంతుల వద్ద మాత్రమే వుంటాయి. సామాన్య ఇన్వెష్టరు వీటిని కొని దాచుకోలేరు.

షేర్ మార్కెట్ పోకడలలో మరీ ఆందోళన కల్గిస్తున్న విషయ మేమిటంటే - చీమ చిటుక్కుమన్నా మార్కెట్ ఉలిక్కి పడటం! చిన్న చిన్న రాజకీయ సంఘటనలకూ మార్కెట్ చలించి పోతున్నది. ఉత్తర ప్రదేశ్‌లో ప్రభుత్వం మారినా షేర్ల ధరలు తగ్గాయి. ఆర్థిక సంస్కరణల కొనసాగింపు పై ఎవరో ఏవో పుకార్లు లేపితే ఇండెక్స్ దిగజారి పోతున్నది. యుద్ధము, ఆర్థిక సంక్షోభం వంటి ప్రబల కారణాలకు మార్కెట్ ప్రతిస్పందిస్తే అర్థం వుంటుంది. కానీ స్వల్ప రాజకీయ విషయాల పై సైతం ప్రతిస్పందన విచారకరం. మన షేర్ మార్కెట్ ఇంకా పరిపక్వ దశకు చేరుకో లేదని, పరిణతి సాధించ లేదని చెప్పడానికి ఇదే రుజువు.

**తగ్గిన ధరల్లో అమ్ముదామన్నా చిన్న కంపెనీల షేర్లను ఎవరూ కొనడం లేదు - ఎప్పుడు మనకీ శాప విమోచనం?**

ఈ మార్పు చేర్పుల వల్ల 1994 జనవరి నుంచి నేటి వరకు ఒకటిన్నర ఏడాదిలో షేర్ల పై పెట్టుబడి పెట్టిన వారు లక్ష కోట్ల రూపాయల వరకు నష్ట పోయారు. సామాన్య ఇన్వెష్టరు ఈ నష్టం భరించలేరు. చాలా కంపెనీల షేర్ ధరలు ఈ మధ్య కాలంలో 30 నుంచి 40 శాతం వరకు పడిపోయాయి. నష్టం వస్తే వచ్చింది. అయిన కాడికి అమ్ము కుందామన్నా పలు చిన్న కంపెనీల షేర్లు కొనే వాళ్లు లేరు. విదేశీ ఇన్వెష్టర్లు, స్వదేశీ సంస్థలు, మ్యూచ్యువల్ ఫండ్స్ మన మార్కెట్ పై పూర్తి నమ్మకంతో వ్యాపారం చేసినప్పుడే మనమీ శాపం నుంచి విమోచనం పొందుతాము; మార్కెట్ క్రమేణా కోలు కొంటుంది. ఈ మేలు జరిపే బాధ్యత, అవకాశం సెబికి మాత్రమే వుంది. వారు పూనుకొని అందర్నీ రంగంలోకి దింపాలి. ఇంకొక ప్రక్క దేశంలోని అన్ని రాజకీయ పార్టీలూ ఆర్థిక సంస్కరణల పట్ల తమ మద్దతు ప్రకటించాలి. రాజకీయంగా ఆర్థిక సంస్కరణలకు ప్రమాదం లేదని ప్రజలకు అర్థమయ్యేట్లు పార్టీలు స్పష్టం చేస్తే - ఏ పార్టీ అధికారంలోకి వస్తుందని తెలిసినా మార్కెట్‌లో చలనం వుండదు. రాజకీయ నాయకులు ఈ వాస్తవం గుర్తించాలి.

షేర్ మార్కెట్‌ను తమ స్వంత ప్రయోజనాలకు వాడుకొనే కంపెనీల పై సెబి మరికొంత కఠిన చర్యలు చేపట్టడం అవసరం. ఇటువంటి వాటి వల్ల ఆ

కొరవ 23 పేజీలో

# మోర్గాన్‌స్టాన్లీని నమ్మిన వారందరూ మునిగిపోయారు!

ఇన్వెష్టర్ల ఆశలను అడియాసలు చేయడంలో అగ్ర తాంబూలం మివ్వ దగిన సంస్థ మోర్గాన్ స్టాన్లీ! 1994 జనవరిలో వీరు నిధుల సేకరణ చేపట్టి నప్పుడు జనం విరగబడి డబ్బు కట్టారు. విజయ వాడ వంటి నగరాలలో అయితే ఆఖరు తేది మించి పోతుందని, అవకాశం పోతే మళ్లీ రాదని వేలాది మంది చిన్న ఇన్వెష్టర్లు బ్యాంకుల దగ్గర బదులు తీరారు. ఈ మూకను అదుపు చేయడానికి పోలీసులు లాఠీ ఛార్జి చేయవలసి వచ్చింది. ఈ రకంగా దాదాపు వెయ్యి కోట్ల రూపాయలు దండు కొన్నది ఆ కంపెనీ.

కానీ చివరకు జరిగిందేమిటి? వారి ఆర్థిక ఫలితాలు ఘోరంగా వున్నాయి. 1995 ఏప్రెల్‌కు వారు చూపిన లాభం కేవలం 3 కోట్లు మాత్రమే. రూ. 10 ల షేర్ ధర 7 రూపాయలకు పడిపోయింది. నెట్ అసెట్ వాల్యు రు. 9.03లు మాత్రమే. మార్కెట్‌లో వారు 892 కోట్లు వెచ్చించి కొన్న షేర్ల విలువ 795 కోట్లకు పడిపోయింది. ఇన్వెష్టర్లు అన్ని రకాలుగా నష్టపోయారు. తక్కువ ధరకు లభిస్తున్నాయని తమ షేర్లను తామే 7 నుంచి 9 రూపాయలకు కొనుగోలు చేస్తున్నది కంపెనీ.

సెబి రూల్స్‌ను వీరు తరచు అతి క్రమిస్తున్నారు. వీటిలో ప్రధానమైనది - షార్ట్ సెల్లింగ్. తమ దగ్గర వున్న షేర్ల సంఖ్యకు మించి మార్కెట్‌లో అమ్మేస్తున్నారు. దీనివల్ల స్పెక్యులేషన్ పెరిగి పోతున్నది. సెబి నిబంధనల ప్రకారం ఏ మ్యూచ్యువల్ ఫండ్ కూడా ఏ కంపెనీలోనూ దాని ఈక్విటీలో 5 శాతానికి మించిన షేర్లను కొనుగోలు చేయకూడదు. మోర్గాన్ స్టాన్లీ ఈ నిబంధనకు తిలోదకాలిస్తున్నది. వీరు చేసే తప్పులను సెబి ఎందుకు ప్రశ్నించదో అర్థం కాదు. వీరినిట్లా వదిలేస్తే, అది అలుసుగా తీసుకొని యుటిఐ వంటి సంస్థలూ అవే తప్పులు చేస్తాయి.

డాక్టర్ ఎ.దుర్గాప్రసాద్

## ఐడిబిఐ షేర్ అనవసరం

ఇండస్ట్రియల్ డెవలప్ మెంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా - ఐడిబిఐ - రు. 120 ల ప్రీమియంతో [illegible] ఇష్యూకు

కొరవ 23 పేజీలో

# హరిజన ప్రభుత్వం

ఉత్తరప్రదేశ్ ముఖ్య మంత్రిగా పదవి చేపట్టి, దేశ రాజకీయాలను ఒక కుదుపు కుదిపారు కుమారి మాయావతి. 450 మంది సభ్యులు గల శాసన సభలో కేవలం 69 మంది ఎమ్మెల్యేలతో అధికారాన్ని చేపట్ట గల్గడం ఒక ఆశ్చర్యమైతే; బ్రాహ్మణ ఆధిక్యత కల్గిన ఉత్తర ప్రదేశ్‌లో ఒక హరిజన మహిళ నేతగా వ్యవహ రించ గల్గడం మరొక అద్భుత పరిణామం. రానున్న పార్లమెంట్ ఎన్నికలలో ఉత్తర ప్రదేశ్‌లో అత్యధిక స్థానాలు పొందాలని తపన పడుతున్న బిజెపి ఆడిస్తున్న నాటకంలో ఇది ఒక అంకం మాత్రమే. ములాయం సింగ్ యాదవ్ ముఖ్య మంత్రిగా వున్నంత కాలం ఉత్తర ప్రదేశ్‌లో తాము మెజారిటీ సాధించడం అసాధ్యమని బిజెపి నేతలందరికీ అర్థమైంది. అందువల్లే వారు బిఎస్‌పి నేత కాన్షీరాంను ప్రలోభ పెట్టి ఆ ప్రభుత్వాన్ని కూల ద్రోయించారు. అందుకు ప్రతి ఫలంగా మాయావతికి పదవి తాయిలం తినిపించారు.

ఈ మార్పుతో బిజెపి రెండు రకాలుగా లాభ పడింది. తమ ఎన్నికల విజయానికి ప్రధాన ప్రతి బంధకంగా వున్న ములాయం పీడ విరగడ కావడం ఒక లాభమైతే; ఒక హరిజన ప్రభుత్వాన్ని నెలకొల్పిన పార్టీగా దళితులలో సానుభూతి పెంచు కోవడం రెండవ లాభం. సాధారణంగా బిజెపికి సవర్ణుల పార్టీ అనే ముద్ర వుంది. ఆ పార్టీలో పెద్ద లందరూ వారే. హరిజనాది బలహీన వర్గాల పై తమ ప్రభావం ప్రసరించే కృషి వారెప్పుడూ చేయలేదు. ఇప్పుడు వారికా అవకాశం లభించింది. పార్లమెంట్ ఎన్నికల వరకు మాయా వతి ప్రభుత్వాన్ని కొన సాగింప జేస్తే ఆమె బిజెపి పట్ల సానుకూలంగా వ్యవ హరించక తప్పని పరిస్థితి ఏర్పడు తుంది. అయితే నిన్న మొన్నటి వరకు ఒకరి నొకరు శత్రువులుగా భావించు కొంటూ, నిందించు కొంటూ వుండిన వీరిద్దరూ ఈ రోజు కలిసి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం భారత దేశంలో ప్రబలి పోతున్న అవకాశవాద రాజకీయాలకు, దిగజారి పోతున్న రాజకీయ విలువలకు అద్దం పడుతున్నది.

కుర్చీ వదలి పెట్టనని భీష్మించుకొని కూర్చొన్న ములాయం సింగ్‌ను బర్తరఫ్ చేయించడం ద్వారా ఆ రాష్ట్రంలో పెద్ద కుల సంఘర్షణను నివారించారు ప్రధాని శ్రీ పి.వి.; పదవి కాపాడుకొనే చివరి యత్నంలో ములాయం చాలా దిగజారి, బజారు రౌడీ వలె ప్రవర్తించారు. బిఎస్‌పి శాసన సభ్యులను ప్రజలు, పత్రికల వాళ్ళు చూస్తు న్నప్పుడే కొట్టి, ఈడ్చుక పోయారు. మాయా వతి బస చేస్తుండిన గెస్ట్ హౌస్‌ను ముట్టడించారు. బలవంతం గానైనా సరే బిఎస్‌పిని చీల్చి, తమకు మద్దతు ప్రకటింప జేసుకొని అధికారం నిలబెట్టు కోవాలన్నది ఆయన తలంపు. ఈ దౌర్జన్యాలను పోలీసులు చూస్తూ వుండి పోయారు. ప్రధాని స్వయంగా జోక్యం చేసుకొని, మాయావతికి ఏ ప్రమాదం జరిగినా నువ్వు వ్యక్తిగతంగా బాధ్యత వహించ వలసి వుంటుందని ఆ రాష్ట్ర డిజిపిని హెచ్చరించడంతో పోలీసులు కదలి వచ్చారు కాని, లేకుంటే ఆమెను ములాయం రౌడీలు ఏమి చేసి వుండే వారో వూహించ లేము. ప్రధాని సత్వరంగా ఈ చర్య తీసు కోకుంటే దళితులు పెద్ద ఎత్తున తిరుగు బాటు ప్రకటించే వాతావరణం నెలకొని వుండింది. అదే జరిగి వుంటే రాష్ట్రం కుల కార్చిచ్చుతో బుగ్గి పాలై వుండేది. దాన్ని అదుపు చేయడం ఎవ్వరి తరమయ్యేది కాదు.

తెలుగుదేశం రాజకీయాలలో లక్ష్మీపార్వతి వలె, హఠాత్తుగా వెలుగులోకి వచ్చిన మహిళ కుమారి మాయావతి. లక్ష్మీపార్వతి ఎన్టీఆర్ అండతో అందల మెక్కితే, మాయావతి బిఎస్‌పి అధినేత కాన్షీరాం నీడలో ఉత్తర ప్రదేశ్ రాజకీయాలలో ప్రాభవం సంపా దించారు. కాన్షీరాంతో ఆమె సంబంధా లేమిటో ప్రపంచానికి తెలియదు కాని, ఉత్తర ప్రదేశ్‌లో పార్టీ పెత్తనాన్ని ఆయన ఆమెకే అప్ప జెప్పారు. దాన్ని వినియో గించుకొని ఆమె పలుమార్లు ముఖ్యమంత్రిగా వున్న ములాయంను గెస్ట్‌హౌస్‌కు పిలిపించి అవమానించేది. ఉన్న తాధికారులనూ హుంక రించేది. బిఎస్‌పి శాసన సభ్యులు,

**జమీన్‌రైతు**

మంత్రులను గంటల పర్యంతం నిలబెట్టి వుంచేది. ఆమెకు కష్టం కల్గిస్తే, కాన్షీరాం కోపపడతాడని భయంతో ములాయం ఆ అవమానాలను సహించే వాడు. సాధారణ స్థితి నుంచి రెండేళ్ల వ్యవధిలో ఉత్తర ప్రదేశ్ వంటి అతి పెద్ద రాష్ట్రానికి నేతగా ఎదగడం మాయావతి అదృష్టం.

ములాయం ప్రభుత్వాన్ని కూల ద్రోయకుండా వుండి వుంటే బహుజన సమాజ్ పార్టీ రాజకీయంగా చాలా నష్ట పోయి వుండేది. కాన్షీరాం తల బిరుసు తనంతో విసిగి పోయిన ములాయం, వారి బలంతో తాను అధికారంలో కొన సాగుతూనే ఆ పార్టీని జనంలో బలహీన పరచే యత్నం మొదలు పెట్టారు. పంచాయితీ ఎన్నికలలో బిఎస్‌పిని నిర్వీర్యం చేసేశాడు. మరి కొంత కాలం గడిచి వుంటే బిఎస్‌పిలోని అత్యధిక శాసన సభ్యులు చీలిపోయి, ములాయం పార్టీలో చేరిపోయి వుండే వారని అంచనా. ఆ ప్రమాదాన్ని పసి గట్టి బట్టే, కాన్షీరాం అత్యంత రహస్యంగా బిజెపితో ఒప్పందం కుదుర్చుకొని, హఠాత్తుగా తమ మద్దతు వుపసంహరి స్తున్నట్లు ప్రకటించారు. ఇదెంత గోప్యంగా జరిగిం దంటే, మాయావతి గవర్నర్‌కు మద్దతు ఉప సంహరణ లేఖ ఇచ్చే వరకు గూఢచారి వర్గాలకూ అంతు బట్టలేదు. ములాయం ఏ మాత్రం ముందుగా ఈ పరిణామాన్ని పసిగట్టి వుండినా పరిస్థితులు వేరుగా వుండేవి.

ఎట్లయితేనేమి, ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రంలో ఒక హరిజన ప్రభుత్వం ఏర్పడింది. సామాజి కంగా అణగారిన జాతిగా పరిగణింప బడే దళితులకు పరమా నందం కల్గించే [illegible] ఈ విజయాన్ని వారు నిలబెట్టు కోవాలని, సుస్థిర [illegible] కోవాలని కోరుకుందాం!

---

జమీన్‌రైతు
.6.1945
వెల: 0-1-6 పేజీలు:8

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

### నెల్లూరుజిల్లా కాంగ్రెసు అసెంబ్లీ

పై సంఘాన్ని పెట్టి ఇప్పటికి ఆరు మాసాలైనా ఇంత వరకు కార్యాలయము లేదు. పనిలేదు, పనులు చెప్పే వారు లేరు. చేసే వారు లేరు. కార్యదర్శి వద్ద కాసైనా లేదు. కార్డు వ్రాయటానికి కూడ. ప్రతి సభ్యుడు నెలకొక చిలుప వంతున స్వంత వడుకునూలు ఇయ్యవలెనని తీర్మానించారు. సభ్యులుగానున్న 50 మందిలో నూలు చందా ఇస్తుండేవారు నలుగురికన్న హెచ్చులేరు.

ఈ విధంగా కాదు పనులు జరగ వలసినది.

ఎక్కువ తీరిక గలవారు అటువంటి జవాబు దారి పనులను నెత్తిన పెట్టుకుంటే బాగుంటుంది.

### పొట్టిశ్రీరాములగారికి బాపూజీలేఖ

హరిజన దేవాలయ ప్రవేశ ప్రచారకుడు పొట్టి శ్రీరాములు గారు గాంధీజీకి తమ నిత్యచర్యను వ్రాసిన లేఖకు బదులుగా బాపూజీ ఈ విధంగా ప్రత్యుత్తర మిచ్చారు. నీవు వడికిన నూలును హరిజన నిధి కర్పించడం కంటె, నీవు దానిని (వస్త్రం కొరకు) ఖాదీకి బదులుగా ఇచ్చి వేయటం బాగా వుంటుంది. అన్నం నీవన్నట్లు భిక్షాటనవల్ల తినవచ్చును. దేవాలయ ప్రవేశ మొకటే కాదు హరిజనోద్ధరణకు మార్గం. అనేక మార్గములలో అదొకటి.

### నెల్లూరు ముచ్చట్లు

**కాలేజి కమిటి**

5 తేది నామినేటెడ్ సభ్యులు ఎలెక్షన్ సభ్యులు చేరి ఈ క్రింది 5 మంది సభ్యులను కోఆప్టు చేసు కొన్నారు. (1) బెజవాడ గోపాలరెడ్డి, (2) పొణకా గోవిందు రెడ్డి, (3) బి. రామస్వామయ్య. (4) నన్నపురెడ్డి సుబ్బిరామి రెడ్డి. (5) బి. వెంకట నరుసు (అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరు). బెజవాడ రామచంద్రా రెడ్డి గారు అంగీక రించనందున నన్నపురెడ్డిని తీసుకున్నారు.

**చక్కెర కరువు**

మళ్లీ చక్కెర కరువు దాపరించింది. రెషన్ కార్డు యెత్తుకొని స్టోన్ హౌసు పేటకు పోయి చీటి తెస్తె టవున్, తిప్పరాజు వారి వీధి చక్కెర కొట్లో 1/2వీశ చక్కెర దానం జరుగుతుంది. అంటే ఒక మనిషికి ఒక దినం పని. ఇది చక్కెర రెడ్డి లోపమని గట్టిగా నేనంటాను. ఆ చీట్ల పందారం టవున్ లోనైనా పెట్ట రాదటయ్యా! రెడ్డి గారి చర్యను రెండు భాగాలుగా జేసి చక్కెర లభాలన్ని దానధర్మాల కుపయోగి స్తున్నందున అభినందిస్తూ, చక్కెరకు అల్లాడిస్తు న్నందుకు గర్హిస్తున్నాము.

కొరవ 22 పేజీలో

---

**జనవాణి**

# అధికార దాహం ముందు సిద్ధాంతాలు దిగదుడుపే!

భారతీయ జనతా పార్టీని మత తత్వ పార్టీ అని దుమ్మెత్తి పోసిన బహు జన సమాజ్ పార్టీ; బహుజన సమాజ్ పార్టీ పేరు చెబితే చిందులు తొక్కే భారతీయ జనతా పార్టీలు ఉత్తర ప్రదేశ్‌లో చెట్టా పట్టాలేసుకున్నాయి. అధికార యావ ముందు సిద్ధాంతాలు దిగ దుడుపేనని భారతీయ రాజకీయ చరిత్రలో ఈ రెండు పార్టీల అపవిత్ర పొత్తు వల్ల మరోసారి నిరూపితమైంది. కేంద్రంలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని కూర్చినప్పుడు బిజెపి అవకాశ వాదం బయట పడింది. బి.ఎస్.పి. పొత్తు వల్ల ఆ పార్టీ నగ్న స్వరూపం మరో సారి తేటతెల్ల మైంది. ఏది ఏమైనా ఆ రెండు పార్టీల పొత్తు మూడు నాళ్ల ముచ్చటనేది అందరికీ తెలిసిందే. ఉత్తర ప్రదేశ్ ఓటర్లు విజ్ఞులు. రాబోయే ఎన్నికల్లో ఈ పొత్తుకు తగిన గుణ పాఠం చెప్పి రెండు పార్టీల నాయకులకూ కనువిప్పు కలిగిస్తారు.

నెల్లూరు -ఎస్. రవికుమార్

### ఆనం వెంకటరెడ్డికి సాటిరారు!

జిల్లాలో అనాదిగా వున్న రాజకీయ కుటుంబాల్లో ఆనం వారి కుటుంబం ఒకటని అందరికీ తెలుసు. వీరిలో స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి గారు రాష్ట్ర వ్యాప్తంగా గొప్ప పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొని వుండవచ్చు. కాని ఆనం వెంకట రెడ్డి వలె తనదైన భాషలో సామాన్యులను ఆత్మీయంగా పలుకరించే తీరు వారి కుటుంబంలో ఎవరికీ అబ్బలేదు. ధైర్యాన్ని ప్రదర్శించడంలోనూ ఆయనకు ఎవరూ సాటిరారు. జై ఆంధ్ర ఉద్యమంలో ఆ ధైర్యానికి ఆశ్చర్య పోయిన స్వర్గీయ ఇందిరా గాంధీ నెల్లూరు పులిగా అభివర్ణించిన ఏకైక వ్యక్తి ఆయన. ఒక్క నాదెండ్ల భాస్కర రావుతో చెలిమి చేసినప్పుడు తప్ప ఏనాడూ ఎవరూ వేలెత్తి చూపలేని నిష్కళంక రాజకీయ జీవితం వెంకట రెడ్డి గారిది. కాపువీధిలో నడచి పోతూ వారి ఇంట్లోకి తొంగి చూస్తే పులిలా కుర్చీలో కూర్చొని కనపడే వారు ఇక లేరంటే మనస్సు చివుక్కు మంటుంది.

అమంచర్ల -షేక్ మస్తాన్‌ఖాన్

### ఏనుగ శ్రీనివాసులు రెడ్డి గారు ధన్యజీవి!

జిల్లా, రాష్ట్ర, దేశీయ పరిధులను దాటి అంతర్జాతీయ ఎల్లలకు పరుచుక

# ఉత్తరక్రియలు



అర్థ శతాబ్దికి పైగా ఆనం కుటుంబ రాజకీయ ప్రాభవానికి కారకులు, ప్రేరకులు
తెర వెనుక వుంటూ మా రాజకీయ జీవితానికి మార్గనిర్దేశం చేస్తుండిన మా ఇంటి పెద్ద
తను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరించడంలో లోకమంతా వ్యతిరేకించినా చలించని ధీశాలి, ఎవరికీ ఎప్పుడూ తలవంచని రాజకీయ వీరుడు
నిర్భయుడు, ముక్కుసూటి మనిషి, ప్రజానాయకుడు

# శ్రీ ఆనం వెంకటరెడ్డి గారు

**5.6.95** తేది సోమవారం శాశ్వతంగా మమ్ము విడిచి పరలోకం తరలి పోయారు.
వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## వారి ఉత్తరక్రియలు

15.6.95 తేది గురువారం నెల్లూరు, కాపువీధిలోని
మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

## ఆనం వెంకట రమణమ్మ - భార్య

కుమారులు - కోడళ్ళు

ఆనం వివేకానందరెడ్డి - హిమవతి ఆనం రామనారాయణ రెడ్డి - శిరీష
ఆనం జయకుమార్‌రెడ్డి - ఉమామల్లిక ఆనం విజయకుమార్‌రెడ్డి - అరుణ

కుమార్తె - అల్లుడు

వి. శ్రీవళ్ళి - వి.వి. కృష్ణారెడ్డి
మరియు మనుమలు, మనుమరాండ్రు

**15.6.95** తేది ఎ.సి.సెంటర్ నందు మధ్యాహ్నం **12.00** గంటలకు
ఎ.సి. సంపూజన కమిటీ ఆధ్వర్యంలో పేదలకు అన్నదానం జరుపబడును.

# నాకు పదవి ఇచ్చి చూడండి, తడాఖా చూపుతానంటున్న పార్వతి



ఆనం వెంకటరెడ్డి గారి భౌతిక కాయానికి పెన్న ఇసుకలో పోలీసు వందనం

# చంద్రబాబు తోక కత్తిరింపుకు ఎన్టీఆర్ రెడీ?

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు త్వరలో మంత్రి వర్గంలో మార్పులు - చేర్పులు చేసేందుకు కసరత్తు ప్రారంభించారు. ప్రస్తుతం ముఖ్యమంత్రితో కలుపుకొని మంత్రి

**హైదరాబాదు వార్తాకథనం**

వర్గంలో మొత్తం 32 మంది వున్నారు. ఈ సంఖ్యను మరో నాలుగుకు పెంచి 36 మందితో మంత్రి మండలికి కొత్త రూపు ఇవ్వాలని ఎన్టీఆర్ భావిస్తున్నారు. ఇందులో భాగంగానే 'అసమర్థ' మంత్రులకు ఉద్వాసన పలికి సమర్థులైన వారికి మంత్రి తీర్థం ఇవ్వాలని ఎన్టీఆర్ నిర్ణయించారు. గత ఆరు నెలలలో ఆయా మంత్రుల పని తీరును సమీక్షించి, రాజకీయంగా వారి అవసరాన్ని అంచనా వేసి మంత్రి పదవిలో ఉంచాలా? ఉద్వాసన పలకాలా? అన్న విషయం తేల్చడానికి ఎన్టీఆర్ తర్జన భర్జన పడుతున్నారు.

కార్పొరేషన్లు పార్టీ పదవుల పందారం దాదాపు పూర్తయిన దృష్ట్యా ఇక మంత్రి వర్గం పై దృష్టి నిలపాలని ఎన్టీఆర్ నిర్ణయించడంతో పలువురు మంత్రుల గుండెల్లో రైళ్లు పరుగెత్తు తున్నాయి. ఇటీవలి కాలంలో పెచ్చు పెరిగిన కుటుంబ కలహాలు, అల్లుళ్ల గొడవలు హరికృష్ణ రంగ ప్రవేశం, లక్ష్మీపార్వతి వీర విహారం తదితర పరిణామాల్లో తలదూర్చిన మంత్రులంతా ఇప్పుడు తలపట్టుకు కూర్చున్నారు. అయితే మేడమ్‌ను నమ్ముకున్న వాళ్లు మాత్రం 'భరోసా'గా వున్నారు. తెలుగు దేశం పార్టీలోని ఇటీవలి రాజకీయ పరిణామాలు మేడమ్ ఆధిక్యతను చాటు తుండడంతో మేడమ్‌ను నమ్ముకున్న వాళ్లు క్షేమం అన్న ప్రచారం జరుగుతోంది. కాగా ఈసారి మంత్రి వర్గం మార్పుల్లో చిన్నల్లుడు చంద్ర బాబు నాయుడి పై ప్రధానంగా "వేటు" పడుతుందని ప్రచారం జరుగుతోంది. పార్టీలో నెలకొన్న ఇటీవలి పరిణామాలకు, కుటుంబ కలహాలకు చంద్ర బాబే కారణమని లక్ష్మీపార్వతి ప్రతి రోజూ ఎన్టీఆర్‌కు బ్రెయిన్ వాష్ చేస్తోందని తెలుస్తోంది. చంద్రబాబు ప్రాధాన్యతను తగ్గిస్తే అన్ని సమస్యలూ సమసి పోతాయని లక్ష్మీపార్వతి ముఖ్యమంత్రికి సలహా ఇస్తోందట.

ప్రస్తుతం ఆర్థిక, రెవిన్యూ శాఖలను నిర్వహిస్తున్న చంద్రబాబును దెబ్బ తీయాలంటే ఒక శాఖను కత్తిరిస్తే సరిపో తుందన్నది లక్ష్మీపార్వతి సలహా. పార్వతి ప్రమేయంతోనే చంద్రబాబుకు ఆయన సొంత జిల్లాలో తలనొప్పిగా తయారైన, మేడమ్ కుడిభుజం గాలి ముద్దు కృష్ణమ నాయుడుకి విద్యా శాఖతో పాటు మరో ముఖ్యమైన శాఖను కేటాయించే అవకాశం కూడా వుంది. చంద్రబాబును వ్యతిరేకించి కూడా, దెబ్బ తినకుండా దిటుగా అటు చిత్తూరు, ఇటు రాష్ట్ర రాజకీయాల్లో నెట్టుక వస్తున్న గాలికి లక్ష్మీపార్వతి ఆజ్యంతోడైతే, చిన్నల్లుడికి ఇబ్బందులు తప్పవు. కాగా చంద్రబాబుతో చెట్ట పట్టాలు వేస్తున్న మంత్రులకు కూడా కుదుపు ఉండవచ్చని భావిస్తున్నారు. ఈసారి ఏర్పాటయ్యే మంత్రి వర్గంలో మేడమ్ గారి అడుగులకు మడుగులొత్తే వారి సంఖ్యే ఎక్కువగా వుండొచ్చు. మంత్రి వర్గం మార్పులు - చేర్పులు వార్త ప్రచారంలోకి రావటంతో మేడమ్ చుట్టూ ప్రదక్షిణాలు చేసే మరదుల సంఖ్య బాగా పెరిగింది.

## నాథా! నాక్కూడా!

త్వరలో జరిగే మంత్రి వర్గం మార్పులు - చేర్పుల్లో తనకు కూడా స్థానం కల్పించాలని లక్ష్మీపార్వతి ఎన్టీఆర్‌ను కోరినట్లు తెలుస్తోంది. అసమర్థ మంత్రుల ఏరివేత సందర్భంగా తనకు అధికారం కల్పిస్తే తన సత్తా ఏమిటో చూపించ గలనని లక్ష్మీపార్వతి ఎన్టీఆర్‌కు సవాలు విసురుతోందట.

అయితే ఎన్టీఆర్ మాత్రం అర్ధాంగి మాటలకు పొంగి పోకుండా, తొందర పడకు పార్వతీ. నీకు టైమ్ వస్తుంది. అప్పుడు అధికారంలోకి వద్దువుగాని అంటూ సున్నితంగా తిరస్కరించాడట. మంత్రి పదవి లేకపోతే పోయింది కనీసం పార్టీ పదవైనా ఇచ్చి చూడండి. నేనంటే ఏమిటో రుజువు చేస్తాను" అంటూ పార్వతి ఎన్టీఆర్ పై ఒత్తిడి తెస్తోందట.

కొరవ 13 పేజీలో





# నివాళి

మాకెంతో అప్పుడు, అన్నిటా మాకు మార్గదర్శి,
సహాయ సహకారాలందించిన మా అభివృద్ధికి కారకులైన



# శ్రీ ఆనం వెంకట రెడ్డి గారు

స్వర్గస్తులైనందుకు మమ్ము ఖిన్నులను చేసింది
అంతటి నిరాడంబరుడు, ఋజువర్తనుడిని మర్లా
చూడబోము. వారికి దైవ సన్నిధిని చిరశాంతి కలుగాలని
ప్రార్థిస్తూ, వారి కుటుంబానికి మా సానుభూతిని తెలియజేస్తున్నాము

**కోడూరు రాఘవరెడ్డి, ఛేర్మన్**

పసుపులేటి మాధవయ్య        ఉగ్గుమూడి వసుంధర
బాలరథ్ నరేంద్రప్రసాద్        యేటుకూరు భాగ్యలక్ష్మి

ట్రస్ట్‌బోర్డు సభ్యులు



## శ్రీ రాజరాజేశ్వరీ దేవస్థానం

నెల్లూరు - 524 004.

### సినిమాల తర్వాత...

# సమాజాన్ని పతనం చేస్తున్నది పత్రికలే!

జమీన్‌రైతు వ్యవస్థాపక సంపాదకులు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామా నాయుడు గారి జయంతి సభ 3 తేది ఆఫీసు ఆవరణంలోనే ఆత్మీయంగా, ఆహ్లాద కరంగా జరిగింది. ఆత్మీయంగా అని ఎందు కన్నా మంటే వక్తల ప్రసంగాలలో జమీన్‌రైతు పట్ల ఆత్మీయత, అభిమానం వ్యక్తమైనాయి కాబట్టి.

ఈ జయంతి సభలను సంకల్పించి, పందొమ్మి దేళ్లపాటు నడిపించిన స్వర్గీయ నెల్లూరు శ్రీరామమూర్తి గారు లేకుండా జరిపిన రెండవ జయంతి ఇది. సభా నిర్వహణలో ఆయన లేని లోటు కొట్టొచ్చి నట్లు కన్పడింది. కానీ, చేయ గల్గిందేమీ లేదు కదా?

ఈ సారి జయంతి అవార్డును ఉదయం మాజీ చీఫ్ ఎడిటర్ శ్రీ పొత్తూరు వెంకటేశ్వర రావు గారికి ఇచ్చాము. ముప్పయ్యేళ్ల సుదీర్ఘ పాత్రికేయాను భవం కంటే, పత్రికా స్వేచ్ఛ పట్ల వున్న అనురక్తి, దాన్ని ఆచరించడానికి తగిన మనో ధైర్యం, త్యాగ భావాలు వెంకటేశ్వర రావు గారిలో ఎన్న దగినవి. వార్త ప్రచురణలో తన స్వాతంత్ర్యాన్ని కాపాడు కోవడం కోసం, పత్రికలో తన హోదానే విడ నాడుకున్నా రాయన. ఈ తరం సంపాదకులలో ఈపాటి ఆశయ నిబద్ధత కల్గిన వారెందరున్నారు చెప్పండి? యముడికి, శివుడికి లొంగని ధీరాధాత్తతతో తన జర్నలిజం జీవితాన్ని గడిపిన రామా నాయుడు గారి స్మారక అవార్డును వెంకటేశ్వర రావు గారి కివ్వడం - ఈ కోణం నుంచి చూస్తే ఎంతటి సముచితమో ప్రత్యేకంగా వివరించ నవసరం లేదు.

ఆనాటి సభను వర్తమాన సమాజం అధ్యక్షులు, ప్రముఖ న్యాయవాది శ్రీ పి.వి. రమణా రెడ్డి గారు అధ్యక్షించారు.

తెలుగు పత్రికా లోకంలో రామా నాయుడు గారి స్థానం విలక్షణమైన దన్నారు పివి రమణా రెడ్డి గారు. పత్రికలలో గ్రామీణ భాషను తొలిసారిగా ప్రవేశ పెట్టింది రామానాయుడు గారేనని; తాను డిగ్రీలు చదువు కోక పోయినా తన వార్తా రచనా శైలిని మరెవ్వరూ అనుకరించ లేనంత అద్భుతంగా మలచుకున్నారని చెప్పారు. 65 సంవత్సరాలు నిరాటం కంగా, నిర్విఘ్నంగా నడిచిన తెలుగు పత్రిక మరొకటి లేదు; జమీన్‌రైతుకే ఆ అదృష్టం దక్కింది; రామా నాయుడు గారి సంకల్ప బలమే ఈ పత్రికను ఇప్పటికీ సజీవంగా వుంచ గల్గుతూంది.

పత్రికలో తానేది వ్రాయ దల్చినా, నిర్భయంగా వ్రాసే వాడాయన; ప్రాణాపాయ పరిస్థితులకూ జంకేవాడు కాదు. జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి ఆయన చేసిన సేవకు కొలమానం లేదు. 1937 ఎన్నికల్లో ఎరుకల సాని సోదె చె[illegible]ట్లు, కాంగ్రెస్ విజయం తథ్యమని ప్రచారం చేసి, ఓటర్లను ప్రభావితు[illegible]ను చేసి, బెజవాడ గోపాల రెడ్డి గారిని గెల్పించారు. జమీన్‌దారీ ఉద్యమానికి రామానాయుడు గారే ఆద్యులు. ఆ విధానం రద్దం[illegible] నంత వరకు విశ్రమించ లేదు. అందువల్లే ఆయన రైతులకు ఆరాధ్యులై నారన్నారు రమణా రెడ్డి గారు.

### రామానాయుడు జయంతి సభలో జర్నలిజం పై సుదీర్ఘ చర్చ

సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న శ్రీ ఆనం వివేకానంద రెడ్డి ఎంతో ఆర్ద్రంగా మాట్లాడారు. సంపాదకులు, పాఠకులు మూడు తరాలు మారి పోయినా, జమీన్‌రైతు శైలిలో మార్పు లేక పోవడం విశేష మన్నాడు వివేకా! ఎన్నో పత్రికలు వస్తున్నాయి, పోతున్నాయి; కాని జమీన్‌రైతు మాత్రం సజీవంగా నడుస్తూనే వుంది. ఎటువంటి వత్తిళ్లకూ లొంగని పత్రిక రాష్ట్రంలో ఏదైనా వుందంటే అది జమీన్‌రైతు ఒక్కటే. జై ఆంధ్రా ఉద్యమ సమయంలో మా కుటుంబంతో పాటుగా జమీన్‌రైతూ ధైర్యంగా వ్యవహరించింది. పత్రికాఫీసును ధ్వంసం చేసినా జంక లేదు. రామా నాయుడు గారిని నేను ప్రత్యక్షంగా చూడలేదు. కాని, స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి గారు దాచి పెట్టుకొన్న పాత సంచికలు చదివాను. వాటి ద్వారానే రామా నాయుడు గారి శైలి గొప్పదనం నాకు తెలిసింది. జమీందారీ విధానాన్ని ఏ విధంగా వ్యతిరేకించిందో, కాంగ్రెస్ పార్టీని అంతే ప్రగాఢంగా అభిమానించింది జమీన్‌రైతు; కాంగ్రెస్‌లో వుంటూ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పని చేసే వారిని ఎప్పుడూ వదలి పెట్టలేదు. జమీన్‌రైతు విమర్శలోని యదార్థాన్ని గ్రహించ గల్గితే, వాస్తవ పరిస్థితులు తెలుస్తాయి. అది పొగిడినా, తెగిడినా వాస్తవానికి దగ్గరగా వుంటుంది అన్నారు వివేకానంద రెడ్డి.

తర్వాత శ్రీ పొత్తూరు వెంకటేశ్వర రావు జర్నలిజం పోకడల పై ఆలోచనా ప్రేరకంగా, విజ్ఞాన స్ఫోరకంగా ప్రసంగించారు. పత్రికా రచయితే గాక ఆయన మంచి వక్త అని కూడా అర్థమైంది ఆ ఉపన్యాసం వింటే!

రామానాయుడు గారు ఎంతో గట్టి పునాది వేయ బట్టే మూడు తరాలుగా జమీన్‌రైతు ఇంత గొప్ప ప్రజా సేవ చేయగల్గుతూంది. జమీన్‌రైతుకు దాని భాషే జీవం; ఎంతో చక్కని నుడికారాన్ని ఎంచుకొని, పదిలంగా కాపాడు కొంటూ వస్తున్నా రన్నారు వెంకటేశ్వర రావు గారు.

ఆంధ్ర దేశం చాలా మంది గొప్ప జర్నలిస్టులను తయారు చేసింది. కోటంరాజు రామారావు, ఖాసా సుబ్బారావు, చలపతి రావు, నార్ల వెంకటేశ్వర రావు, గోరాశాస్త్రి, రామానాయుడు వంటి వారందరూ ఈ కోవలోని వారే! పత్రికల ఔన్నత్యం దాని సర్క్యులేషన్‌ను బట్టి రాదు; జర్నలిస్టుల గొప్ప తనం వారు తీసుకునే జీతభత్యాల మీద ఆధార పడి వుండదు. జర్నలిస్టు ప్రతిభకు గీటు రాయి అతని రచనే!

అన్నమాచార్య కీర్తనలు, భాగవతం వంటి వాటిలో తెలుగు భాష చక్కదనం, సౌందర్యం, సౌకుమార్యం ప్రతిఫలిస్తాయి. భాష కోసం ఆ కీర్తనలు చదవాల్సిందే అన్నారాయన.

1947కు పూర్వం పత్రికలు, రాజకీయాలు కూడా ఆదర్శాల కోసం నడిచేవి. ఇప్పుడు కేవలం డబ్బు, అధికారం కోసం వీటిని నడుపు తున్నారు. చాలా పత్రికలకు ప్రజల శ్రేయస్సు పట్ల లక్ష్యం లేదు. ఉద్యమ స్ఫూర్తితో ప్రారంభమై, ఆ ఉద్యమం లేకపోయినా అదే స్ఫూర్తితో, సిద్ధాంతంతో, ధ్యేయంతో, ప్రజాసేవే పరమా వధిగా నడుస్తున్న పత్రిక ఏదైనా వుందంటే అది జమీన్‌రైతు ఒక్కటే. అందువల్లనే ప్రజలు ఇన్నేళ్ల పాటు దాన్ని అభిమానిస్తున్నారు అన్నారు వెంకటేశ్వర రావు గారు.

సమకాలీన దిన పత్రికల పోకడల పై ఆయన ఎంతో ఆవేదన వ్యక్తం చేశారు. ఏ పత్రిక కూడా దేశ, సమాజ వాస్తవ పరిస్థితులను తమ వార్తలలో ప్రతిబింబించడం లేదు. అధికార యంత్రాంగంలో ఎంతో అవినీతి వుంది. కానీ ఏ పత్రికా వ్రాయదు. రెండు

కొరవ 18 పేజీలో



రామానాయుడు జయంతి సభలో మాట్లాడుతున్న పొత్తూరు వెంకటేశ్వర రావు, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, పి.వి. రమణా రెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి

# పెండ్లిండ్లు

* * *

నెల్లూరు మునిసి పాలిటీ అంటే ఎవరికైనా తన పేరు జ్ఞాపకం వచ్చేంతగా, అందరికీ తలలో నాలుకగా పనిజేసి, రాటుదేలిన సేవాజీవి, విజాయితీ పరుడు, రాజకీయ వాదులతో తన పరిచయాలను ఎప్పుడూ దుర్వినియోగ పరచని నిలకడ కల్గిన పెద్ద మనిషి శ్రీ పుట్టా గోపాలరెడ్డి తనయుడు రమణారెడ్డి; ఆత్మకూరు, శ్రీ చింతలపల్లి రామిరెడ్డి తనయ శారదల పరిణయం మే 12 తేది ఆత్మకూరులో జరిగింది.

* * *

స్వర్గీయ పి. రమణయ్య కుమారుడు; అంటే జమీన్‌రైతు కుటుంబీకుడు, వాకాడు ఆంధ్రా బ్యాంకు మేనేజరు శ్రీ నెల్లూరు యామినీ చంద్ర బావమరిది - ప్రసాద్, ఆరణి, స్వర్గీయ ఎం. శ్రీరాములు కుమార్తె వసంత వివాహం 12 తేది ఆరణిలోనే జరిగింది.

* * *

ఆం.ప్ర. విద్యుతు ద్యోగుల సంఘం కోవూరు థర్మల్ స్టేషన్ విభాగం అధ్యక్షుడు శ్రీ వి. బ్రహ్మారెడ్డి కుమార్తె శ్రీవర్ష; కావలి పోలీస్ కానిస్టేబిల్ శ్రీ పి. సుబ్బారెడ్డి కుమారుడు వెంకట సుధీర్ పరిణయం 12 తేది కోవూరులో జరిగింది.

* * *

జమీన్‌రైతు మాజీ సహాయ సంపాదకులు, ఉదయం దినపత్రిక చీఫ్ కో ఆర్డినేటరు, వార్తా రచనలో తనదంటూ ఒక శైలిని రూపొం దించుకొని, గుర్తింపు పొందిన రచయిత, అభ్యుదయ భావకుడు శ్రీ పెన్నెపల్లి గోపాలకృష్ణ (గోపి) కుమారుడు అమెరికా అబ్బాయి ప్రశాంత్; అనంతపూర్, ప్రొఫెసర్ కేశవరావు కుమార్తె రాధిక పరిణయం 13 తేది హైదరాబాదులో జరిగింది.

* * *

ఉదయం తిరుపతి ఎడిషన్‌లో బాధ్యత కల్గిన ఉద్యోగం వదలి పెట్టి స్వంత పత్రిక, స్వతంత్ర వ్యక్తిత్వం కోసం నెల్లూరు వచ్చేసిన జర్నలిస్ట్ మిత్రుడు, స్నేహపాత్రుడు, బ్రతకడం చేతకాని భోళా శంకరుడు సి.హెచ్. నాగేశ్వర రావు సోదరి; అంటే కలిచేడు, శ్రీ చింతలపల్లి సుబ్బారావు కుమార్తె జ్యోతి; చిల మాన్ చేను, శ్రీ కలిచెట్టి రామయ్య కుమారుడు రవి బి.ఎ., బి.ఇడి., పెండ్లి 14 తేది గూడురు టిటిడిలో జరిగింది.

* * *

స్వశక్తితో ఆర్థికంగా ఉన్నతికి వచ్చిన కష్టజీవి, హోటల్ సూర్య అధినేత, కామాక్షి ఫైనాన్స్ భాగస్వామి, ఆర్థికంగా

కొరవ 13 పేజీలో

* * *

# వరి పైరుకు పురుగుల బాధ- సకాలంలో నివారిస్తే మేలు!

నెల్లూరు జిల్లాలో, ముఖ్యంగా డెల్టా ప్రాంతంలో వరిని సంవత్సరం పొడవునా సాగు చేస్తూండడం మనందరికీ తెలిసిందే. ఇలా వరి తర్వాత వరి పైర్లనే వరుసగా సాగు చేస్తుండడం వల్ల చీడ పీడల ఉధృతి పెరగడమే గాక భూసారం కూడా క్రమేపి తగ్గుతూ పోతుంది. ఇందుకు ప్రతిగా, వరి - వరి - పెసర; వరి - వరి - పేరు శనగ పంటల పద్ధతిని పాటిస్తే వరి పైర్లు వరుసగా పండించడం వల్ల జరిగే అనర్థాలను కొంత వరకు తగ్గించే వీలవుతుంది.

ప్రస్తుతం జిల్లాలో ఎడగారు వరి పైరు నార్లు పోయడం పూర్తయి నాట్లు వేసే దశలోను, పిలకలు తొడిగే దశలలోను, మొక్కదుగు వరి పైరు (రెండో పంట), చిరుపొట్ట దశ నుండి వెన్ను తీసే, పాలు పోసుకునే దశలలోను వుంది. గత నెలలో వచ్చిన తుఫాను వర్షాల తర్వాత వేసవి ఉధృతి క్రమంగా పెరుగుతూ ఇప్పుడు తీవ్రస్థాయికి చేరుకుంది. ఈ నేపథ్యంలో వరి పైరు పై 'మైట్స్' పురుగులు, మలయ్య నల్లని నల్లి, ఎక్కువగాను; ఆకు ముడత, పచ్చ దీపపు పురుగులు అక్కడక్కడా ఆశించి నష్టాన్ని కలుగ జేస్తున్నాయి. వీటిని సకాలంలో అరి కట్ట నట్లయితే నష్టం హెచ్చు స్థాయిలో జరిగే ప్రమాదముంది. ఈ పురుగులకు సంబంధించిన వివరాలు, వాటి బారి నుండి పైరును కాపాడే సస్య రక్షణా చర్యలను క్రింద వివరిస్తున్నాను.

## సాలీడు జాతి 'మైట్స్' పురుగులు

వరి పైరులో ఆకుల క్రింద

> **డాక్టర్ పి.రాఘవరెడ్డి**
> వరిపరిశోధనాస్థానం,నెల్లూరు
>
> ఎండలకు ఈ పురుగులు మరింత వేగంగా పెరుగుతాయి; మంచి మందులు చల్లితే పైరును కాపాడుకోవచ్చు!

చాలా చిన్నటి పురుగులు ఆశించి రసాన్ని పీల్చి వేయడం వల్ల ఆకులు పాలి పోయి, పైరు ఎండి పోయినట్లు కన్పిస్తుంది. కొన్ని చోట్ల పైరు ఈ విధంగా నష్ట పోవటంతో కొందరు వైరస్ తెగులేమోనని సందేహ పడుతున్నారు. అటువంటి సందేహాలు అనవసరం. ఈ మైట్స్ ఎండలు ఎక్కువగా వుండే టప్పుడే తమ ప్రభావం చూపుతాయి దీన్ని మన రైతాంగం గుర్తించాలి. ఈ పురుగుల నివారణకు డైకోఫాల్ 3.0 మిల్లీ లీటర్ల మందును గాని లేదా నీటిలో కరుగు గంధకాన్ని 3 గ్రాములు ఒక లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.

## మలయన్ నల్లని నల్లి

గత కొన్ని సంవత్సరాలుగా ఎడగారు మరియు సార్వా పైర్లలో మన ప్రాంతంలో, వరి పైరులో నల్లటి పెద్ద పురుగులు గాని లేదా బూడిద రంగుల్లోని పిల్ల పురుగులుగాని మొక్కల మొదళ్ల దగ్గరచేరి రసాన్ని పీల్చి వేయడం ద్వారా వల్ల అధికంగా నష్టాన్ని కల్గిస్తున్నాయి. పురుగులు ఆశించినపుడు పైరు దోమపోటు వలె గుండ్రని సుడులుగా ఎండి పోతుంది ఈ పురుగుల నివారణకు మోనోక్రోటాఫాస్ 1.6 మి.లీ. లేదా క్లోరపైరిపాస 2.5 మి.లీ. మందులో ఒక దానిని మరియు డైక్లోరావాస 1.0 మి.లీ. మందును ఒక లీటరు నీటిలో కలిపి పైరు పై పిచికారి చేయాలి. పైరుకు ఎక్కువగా నీరు పెడితే మొక్కల మొదళ్లలో దాగుకొన్న పురుగులు బయట పడును.

కొరవ 13 పేజీలో

# శ్రద్ధాంజలి



మా నాయనమ్మ

## శ్రీమతి సన్నపురెడ్డి కౌసల్యమ్మ

(స్వర్గీయ సన్నపురెడ్డి కృష్ణారెడ్డి గారి భార్య - కోవూరు)

1.6.95 తేది గురువారం స్వర్గస్తురాలైనది.
ఆమె ఆత్మకు చిరశాంతిని కలుగ చేయమని
భగవంతుని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము

**సన్నపురెడ్డి వినోదకృష్ణ - ఉమ**

కుమార్తె - అల్లుడు
పొన్నలూరు ప్రమీలమ్మ - కోదండరామిరెడ్డి

కోడలు
సన్నపురెడ్డి సుమనమ్మ

మనుమలు - మనుమరాళ్ళు
జక్కా స్వప్న - హర్షవర్ధన్ రెడ్డి, బెజవాడ కృష్ణమోహన్ రెడ్డి - రూపమ్మ
పొన్నలూరు ద్వారకనాథ్ రెడ్డి - ఉమ, ఉష - సుబ్బారెడ్డి

**ఉత్తరక్రియలు**

14.6.95 తేది బుధవారం - నిలుపు 15.6.95 తేది గురువారం - ఎత్తురేవు
కోవూరులో మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

# అంత పెద్ద ఉద్యమాన్ని ధైర్యంగా ఎదిరించడం ఆయనొక్కడికే చెల్లింది!



నెల్లూరు టౌన్ వీధులలో ఆనం వెంకటరెడ్డి గారి భౌతిక కాయం పూరేగింపు

ఆనం కుటుంబం పట్ల సామాన్య జనాల్లో వుండే అభిమానానికి 6 తేది సాయంత్రం ఇందిరా భవన్‌లో జరిగిన స్వర్గీయ వెంకట రెడ్డి సంతాప సభ అద్దం పట్టింది. ఒంటి గంట వరకు పెన్నా తీరాన జరిగిన అంత్యక్రియల కార్యక్రమంలో పాల్గొన్న ఆత్మీయులు, అభిమానులు, గ్రీష్మ తాపాన్ని సైతం లెక్క చేయకుండా 4 గంటలకు అఖిల పక్ష కమిటీ ఆధ్వర్యంలో ఏర్పాటైన

**ఆనం వెంకట రెడ్డికి అఖిల పక్షం సానుతాపం**

సభకు హాజరైనారు. సభకు ఆచార్య పిసి రెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. ఆంధ్ర రాష్ట్రంలో ఒకే కుటుంబం నుంచి నలుగురు మంత్రులైన ఘనత ఆనం కుటుంబానికే దక్కింది. అందులో వెంకట రెడ్డిది విశిష్టమైన శైలి; జై ఆంధ్రా వుద్యమాన్ని వ్యతిరేకిస్తూ గాంధీ బొమ్మ వద్ద ఒంటరిగా నిలబడి సదించిన ధైర్యశాలని శ్లాఘించారు. మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి గారు మాట్లాడుతూ 70 ఏళ్లకు పై బడి నెల్లూరు పుర జనులతో రాజకీయంగా, సాంఘికంగా పెన వేసుకొన్న అపురూప వ్యక్తి వెంకట రెడ్డి. ఎన్నికల ప్రక్రియను నిర్వహించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య; కల్లబొల్లి మాటలు చెప్పి ఏనాడూ రాజకీయాలు నడిపినట్లు గుర్తు లేదు. ముక్కు సూటి, నిర్మొగమాటి అయిన ఆయన వలె ప్రజాభిమానం పొందిన వారు జిల్లాలో మరొకరు లేరన్నారాయన. తాను మంత్రిగా పనిచేశారు, తన కొడుకును మంత్రిగా చూశారు; తాను తొలిగా రాజకీయ పదవి అధిష్టించిన మునిసిపల్ ఛేర్మన్ కుర్చీలో తన కొడుకు వివేకా నందరెడ్డి కూర్చోగా చూసి సంతోషంగా కన్ను మూసినట్లు చెప్పారు. ఆనం కుటుంబంలో ధృవతార వంటి వెంకట రెడ్డి కలకాలం ప్రజల మనసుల్లో నిలచి వుంటారని చెప్పి ముగించారు. బిజెపి అధ్యక్షుడు డాక్టర్ ఎస్. వరదయ్య ఆనం కుటుంబంలో వెంకట రెడ్డి మొండి వాడని, అపర చాణక్యుడని చెప్పారు. సిపిఐ నాయకుడు రామచంద్రయ్య వెంకటరెడ్డి సమైక్య వాదని తెలిపారు. బాలాజీ గ్రూప్ ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ పివి ప్రసన్న రెడ్డి వెంకట రెడ్డిని వున్నతమైన రాజకీయ విలువలు కల్గిన నాయకుడని ప్రస్తుతిస్తూ ఆనం కుటుంబాన్ని ఇక నుంచి సంజీవ రెడ్డి ముందుకు నడపాలని కోరారు. న్యాయవాది శ్రీ ఏ. అనంత రామయ్య తన మాటల్లో నిజమైన కమ్యూనిస్ట్ వెంకట రెడ్డి అన్నారు. జిల్లా రాజకీయాల్లో చెడ్డ పేరు లేని కుటుంబం కూడా ఆనం కుటుంబమేనని కితాబిచ్చారు. శ్రీ ఎల్వీ కృష్ణారెడ్డి మాట్లాడుతూ మూడు మంత్రి వర్గాల్లో పనిచేసినా, ఎసి సుబ్బారెడ్డి బ్రతికున్న రోజుల్లో ఆయనకు, తర్వాత సంజీవ రెడ్డికి అనుచరుడిగా సాగారే తప్ప నాయకుడిగా భేషజం ఏనాడూ ప్రదర్శించ లేదన్నారు. తనతో కలసి కార్మిక పక్షపాతిగా పని చేసిన రోజులను గుర్తుకు తెచ్చు కొన్నారాయన. వెంకట రెడ్డి నమ్మిన వారి కోసం ప్రాణాలిచ్చే వ్యక్తని తెలుగు దేశం పార్టీకి చెందిన గోపాల కృష్ణయ్య చౌదరి చెప్పారు. మాజీ మంత్రి శ్రీ వసల పెంచలయ్య మాట్లాడుతూ ఓటర్ల సైకాలజీని వెంకట రెడ్డి వలె వొళ్లించే నాయకులు జిల్లాలో వేరొకరు లేరన్నారు. ప్రకాశం పంతులు తర్వాత అంతటి ధైర్యశాలి వెంకట రెడ్డి అని జౌళి సంస్థ మాజీ ఛేర్మన్ పూసల రంగయ్య చెప్పారు. తన తండ్రి హత్య జరిగినప్పుడు తనను పలుకరించి ధైర్యం చెప్పిన నాయకుడు ఒక్క వెంకట రెడ్డేనని అల్లూరు మాజీ శాసన సభ్యుడు కె. విష్ణు వర్ధన్ రెడ్డి గతాన్ని గుర్తుకు తెచ్చుకొన్నారు. మాజీ శాసన సభ్యుడు పట్రా ప్రకాశ రావు, ఆనం సంజీవ రెడ్డి, పత్రి రవీంద్ర బాబు, ఏసిసి అధ్యక్షుడు శ్రీధర్ రెడ్డి, ఇందిరా భవన్ ట్రస్టీ పివి రమణా రెడ్డి, నేదురుమల్లి పద్మనాభ రెడ్డి, బిజెపి ఆంజనేయ రెడ్డి, నాయుడు రాంప్రసాద్ పలువురు కౌన్సిలర్లు వేదిక పై ఆశీనులయ్యారు.

లారీ, బస్సు ఢీకొని 15 మంది చావు

# సూళ్లూరుపేట ప్రమాదం- ఘోరం... దారుణం!

మన జాతీయ రహదారి రాను రాను మృత్యువుకు దగ్గర దారిగా మారి

**మృత్యువుకు దగ్గరదారిగా మారిన జాతీయ రహదారిపై ఇంకెన్ని ప్రాణాలు బలికావాలి?**

పోతుంది. విజాది కేజాదికి మద్రాసు - విజయ వాడల మధ్య గ్రాండ్ ట్రంక్ రోడ్ పైన లారీ ట్రాఫిక్ పెరిగి పోతుంది; ... రోడ్డు మాత్రం పెరగడం లేదు. రోజుకు కనీసం 4 వేల లారీలు, బస్సుల వంటి భారీ వాహనాలు ఈ రోడ్డు పై రాక పోకలు సాగిస్తాయని అంచనా. రాత్రి 10 నుంచి ఉదయం 8 గంటల లోపైతే, కొన్ని సమయాలలో నిముషానికి ఆరేడు వాహనాలు వెళ్తుంటాయి. ఇవి కాక కార్లు, వ్యాన్‌ల వంటివి అదనం. ఇన్ని బండ్లు నడవాలంటే ఎంత వెడల్పు రోడ్డు కావాలి? ముప్పయ్యేళ్ల క్రితం ట్రాఫిక్‌ను దృష్టిలో పెట్టుకొని నిర్మించిన రోడ్డు ఇది. ఎదురెదురుగా రెండు లారీలు వస్తే మధ్యలో సైకిల్ దూరను కూడా సందు వుండదు. మంచి వేగంలో బండి నడిపే టప్పుడు డ్రైవరు అర సెకను ఏమరు పాటుకు లోనైనా ఎదురుగా వచ్చే బండిని గుద్దు కోవటం ఖాయం. విజయవాడ మద్రాసుల మధ్య ప్రతిరోజూ అన్ని ప్రమాదాలు జరగడానికి, ఏటా కొన్ని వందల ప్రాణాలు గాలిలో కలిసి పోవడానికి ఇదే కారణం.

మొన్న 3 తేది ఉదయం సూళ్లూరు పేట టౌన్ పొలి మేరలలో జరిగిన ఘోర లారీ ప్రమాదమూ ఈ

కొరవ 20 పేజీలో



రామానాయుడు జయంతి సందర్భంగా ఆయన విగ్రహానికి పూలమాలలు వేస్తున్న మునిసిపల్ చైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, కౌన్సిలర్ వి. సుబ్బారావు

# అల్లూరు విష్ణు మళ్లీ జోరు పుంజుకున్నాడు!

అల్లూరు ఎమ్మెల్యే జక్కా వెంకయ్య అభివృద్ధి పనుల విషయమై ఎందువల్లో అంతగా శ్రద్ధ తీసుకోవడం లేదు. తన ప్రతినిధులుగా అల్లూరులో

**వెంకయ్యగారూ- పారాహుషార్?**

...జిన ఇద్దరు వ్యక్తులు కూడా వివిధ ప్రజా సమస్యలు పరిష్కరించడంలో ... మవుతున్నారు. అధికారం ...ప్పుయిన తర్వాత ప్రజల్లో ఏ విధంగా ...రబడాలన్న మీమాంసలో వుండిన మాజీ ఎమ్మెల్యే విష్ణుకు మండల ఎన్నికల్లో గెలుపు టానిక్‌లా పని చేసి జెట్‌లా దూసుకపోతున్నాడు. గత నెలలో కురిసిన భారీ వర్షాలకు అల్లూరు స్వాంపు ప్రాంతం, మట్టం చెరువు, తదితర ప్రాంతాల్లో కోసి కుప్పలేసిన రైతులు భారీగా నష్ట పోయారు. నష్టాన్ని గుర్చి నెల్లూరు రిలీఫ్ కమీషనర్‌కు వినతి పత్రం ఇచ్చి వెంకయ్య గారు సరిపెట్టు కొన్నారు. తోచని స్థితిలో వున్న రైతులను జక్కా వెంకయ్య ఎందువల్లో సరిగా కలసి ఓదార్చలేక పోయారు. దీన్ని అవకాశంగా

కొరవ 23 పేజీలో

# గూడూరు కొళాయిల్లో మురికి నీళ్లు

గూడూరు టౌన్‌లో గత పది రోజులుగా మంచి నీరు వస్తుండడంతో రా అయ్యే కొళాయిల్లో మురికి నీరు సరఫరా అవుతుండడంతో ప్రజలు నీటికై అల్లాడి పోతున్నారు. మునిసిపల్ వాటర్ సప్లై లైన్ పగిలి డ్రైనేజి నీటితో కలసి నీళ్లు కలుషిత మవుతున్నా మునిసిపల్ అధికారుల్లో చలనమే లేకుండా పోయింది. సత్రం వీధి, అశోక్ నగర్ ప్రాంతాల్లో ఈ నీరు త్రాగి పలువురికి అతి సార వ్యాధి సోకింది. ఇప్పటికైనా మునిసిపల్ అధికారులు మేలుకొని పైపుల లీకేజిని అరికట్ట వలసి వుంది.

**జిల్లావార్తలు**

## పోలీస్‌స్టేషన్‌లో పెళ్లి!

లాఠీల మోతలు; పరుష పదజాలాలు వినపడే పోలీస్ స్టేషన్‌లో వేద మంత్రాలు, సన్నాయి మేళాలు వినపడే సరికి జనం విస్తుపోయారు. ఈ మధ్య గూడూరు పోలీసులు దొంగల ముఠాలను పట్టుకోవడం వంటి శాఖాపరమైన పనులతో పాటు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు చేపడు తున్నారు. అటువంటి జాబితా లోనిదే వన్ టౌన్ ఎస్‌ఐ రవీంద్ర తన చేతుల మీదుగా జరిపించిన పెళ్లి. మనుబోలుకు చెందిన వి. మోహన్ బాబు, వెన్నూరు యువతి సత్యశ్రీ గాఢంగా ప్రేమించు కొన్నారు. ఎప్పటిలానే కులం గోడలు, అడ్డు నిలచి పెద్దల ఆమోదాలు లభించలేదు. వేరే పెళ్లి ప్రయత్నాలు ప్రారంభ మయ్యేసరికి సత్యశ్రీ భరించ లేకపోయింది. మోహన్ బాబు ఆమె వత్తిడి భరించలేక ఎస్‌సి, ఎస్‌టి సంక్షేమ సంఘం ద్వారా ఎస్‌ఐ రవిచంద్రను కలిశాడు. వెన్ను ఎస్‌ఐ గారు వారికి ప్రోత్సహించి అండగా నిలబడి; వన్ టౌన్ ఖాకీలనే పెళ్లి పెద్దలుగా నిలబెట్టి పెళ్లి జరిపించేశారు.

# నెల్లూరు నలుచెరగుల్లో
## విలార్మకుడు

### పదవ తరగతిలో జిల్లాకు 4ర్యాంకులు

పదవ తరగతి పరీక్షల్లో నెల్లూరు జిల్లా విద్యార్థినీ విద్యార్థులు తమ ప్రతిభను ప్రదర్శించారు. రాష్ట్ర స్థాయిలో నాలుగు ర్యాంకులు సాధించారు.

ఫస్ట్ ర్యాంక్, కావలి విశ్వోదయ విద్యార్థి పి. హజ రత్నయ్యకు లభించింది. ఆ పిల్లవాడు 600 మార్కులకు 566 సంపాదించాడు. 4 ర్యాంకును చేజర్ల జి.ప. పాఠశాలకు చెందిన జి. హేమంత కుమార్ రెడ్డి 557 మార్కులతోను; 10వ ర్యాంకును నెల్లూరు దర్గామిట్ట జి.ప. పాఠశాలకు చెందిన పి. రాజేష్ నరసింహ రావు 550 మార్కులతో సాధించారు. బాలికలలో కోవూరు జి.ప. బాలికల పాఠశాలకు చెందిన మొబిన్ తాజ్ 553 మార్కులతో 4 ర్యాంకు సాధించింది.

ఈ ఏడాది విశిష్టత ఏమిటంటే, ర్యాంకులు సాధించిన వారందరూ మధ్య తరగతి కుటుంబీకులు. పైపెచ్చు వీరెవ్వరూ విద్యను వ్యాపారంగా మార్చిన కోచింగ్ సెంటర్లలో కాక, వీధి బడులుగా పిలువబడే జి.ప. స్కూళ్ల విద్యార్థులు కావడం మరీ విశేషం. మొదటి ర్యాంకు సాధించిన పి. హజరత్తయ్య, కావలిలో కిళ్లీ బంకు నడుపు కొంటున్న వెంకటేశ్వర్లు కుమారుడు. తన కుమారుడి ఘనతకు ఆ తండ్రి వుప్పొంగి పోతున్నాడు. తన కొడుకును ఐఎఎస్ చదివించా లన్నది ఆ తండ్రి అభిలాష.

• పదవ తరగతిలో జిల్లాలో 52.73 శాతం విద్యార్థులు ఉత్తీర్ణు లైనారు ఇందులో అధిక భాగం ఫస్ట్ క్లాసులే!

### రొట్టెల పండుగ

మొహరం పండుగ సందర్భంగా జరిగే రొట్టెల పండుగకు 11 తేదిని నిర్ణయించారు - బారా షాహి దర్గా నిర్వాహకులు. ఎప్పటి వలెనే ఏర్పాట్లు జరుగు తున్నాయి.

### పంచాయితీ ఎన్నికలు

గ్రామ పంచాయితీ ఎన్నికలకు 10 తేది నుంచి నామినేషన్ల స్వీకరణ ప్రారంభ మౌతుంది. 14 తేది స్క్రూటినీ; 17 తేది విత్‌డ్రాయిల్స్. కావలి డివిజన్‌లో 24 తేది, నెల్లూరు డివిజన్‌లో 27 తేది, గూడూరు డివిజన్‌లో 30 తేది పోలింగ్ జరుగు తుంది. జిల్లాలో మొత్తం 968 గ్రామ పంచాయితీ లున్నాయి. 8956 మంది వార్డు సభ్యు లుంటారు. సర్పంచ్ ఎన్నిక ప్రత్యక్ష పద్ధతిలో జరుగు తుంది.

### రేబాల సుజాతమ్మ మరణం

స్వర్గీయ రేబాల పట్టాభి రామిరెడ్డి గారి సతీమణి శ్రీమతి రేబాల సుజాతమ్మ 4 తేది ఉదయం దర్గామిట్టలోని తన ఇంట్లో కన్ను మూశారు.

రేబాల పట్టాభి రామిరెడ్డి గారు ఎవరో కూడా ఈ తరం వారు మర్చి పోయారు. అందువల్ల సుజాతమ్మ పేరు తెలిసిన వారు తక్కువ.

ప్రఖ్యాత విద్యావేత్త డాక్టర్ సి.ఆర్. రెడ్డి సోదరుడి కుమార్తె ఆమె. జిల్లాలోనే అత్యంత సంపన్నులుగా ఆ రోజుల్లో గుర్తింప బడిన, టౌన్‌హాల్ రీడింగు రూం నిర్మాత అయిన రేబాల పట్టాభి రామరెడ్డి గారి సతీమణి. 1950 లో భర్త మరణించి నప్పటి నుంచి, దాదాపు అర్థ శతాబ్దిగా ఆమె ఇంటికే పరిమితమై వుండినారు. దర్గామిట్టలోని సుజాతమ్మ కాలనీ ఆమె పేరు మీదే ఏర్పడింది. ఈ మధ్యే ఆమె తమ ఇంటి ముందు కోటి రూపాయల వ్యయంతో కృష్ణ మందిరం నిర్మించి, గణపతి సచ్చిదానంద స్వామీజీకి దత్తం చేశారు. కంచి పరమాచార్యులకు అంత రంగిక భక్తురాలు. ఆధ్యాత్మిక కార్యక్రమాలకు, సంస్థలకు విరాళా లిస్తుండే వారు. జనంలోకి రావడం, జనంతో పరిచయాలు పెట్టు కోవడం వుండేది కాదు. ఎస్టేట్ వ్యవహారాలను ఆమె సోదరి శుభప్రదమ్మ చూస్తుండే వారు. ఆమె గత ఏడాది మరణించారు. సుజాతమ్మ గారికి పిల్లలు లేరు.

### వెంకటరెడ్డి గారి నేత్రదానం

ఆనం వెంకట రెడ్డి గారు తన మరణా నంతరం తన కళ్లను దానం చేయాలని కోరి వుండడం వల్ల, ఆయన మరణించగానే కళ్లు రెండింటినీ తీసి ఐ బ్యాంకుకు పంపించారు. జిల్లాలో చాలా మంది నేత్ర దానాలు చేశారు కాని, వెంకట రెడ్డి గారి వంటి ప్రముఖులకు ఆ సత్సంకల్పం కల్గడం ఇదే ప్రథమం. మరణా నంతరమూ తన వ్యక్తిత్వ ఔన్నత్యం చాటుకున్న ఆయనకు మా జోహార్లు.

### ఏడవ తరగతి ర్యాంకులు

ఏడవ తరగతి పరీక్షల్లో జిల్లా స్థాయిలో కోట విద్యార్థి పి. శ్రీనివాసులు ఫస్ట్ ర్యాంక్ సాధించాడు. నెల్లూరు బాలాజీ విద్యాలయం విద్యార్థి జి. సుధీర్ 456 మార్కులలో రెండవ ర్యాంకు, నెల్లూరు, శారదా ఇంగ్లీషు మీడియం స్కూలు విద్యార్థి విశ్వనాథ మణిధరకు 3వ ర్యాంకు లభించాయి.

బాలికల్లో, నెల్లూరు శాంతి నికేతన్ స్కూలుకు చెందిన బి. సరోజిని



దేవి 486 మార్కులతో ఫస్ట్ ర్యాంక్ సాధించింది. అదే స్కూలుకు చెందిన

కొరవ 13 పేజీలో

## దీపం ఆరిపోయింది!

ఆచార్యరంగా గారు తొంభై ఐదేళ్ల నిండు జీవితం గడిపి, పండుటాకు వలె రాలిపోయారు. గుండెనిండా దుఃఖం అవహింపజేసె విషాద వార్త ఇది. కళ్లలో నీరు ఇంకి పోయేట్లు చేసే ఆశనిపాతమిది.

8 తేది సాయంత్రం 4.30 గంటలకు రంగాగారు నిడుబ్రోలు లోని తమ గోభూమిలోనే తుది శ్వాస విడిచారు.

రంగాగారు దేశాని కంతటికీ రైతు బాంధవుడైతే, జమీన్‌రైతుకు ప్రత్యేకంగా పితృ సమానులు. జమీన్‌రైతు స్థాపనాది, చివరి వరకు ఆయన దీన్ని తన స్వంత పత్రికగా భావించేవారు; మా పై ఎంతో ఆదరాభి మానాలు ప్రదర్శించే వారు; తాను జమీన్‌రైతు కుటుంబంలో ఒక సభ్యుడ్ని ప్రేమగా చెప్పుకొనే వారు. ఆయన మరణంతో



జమీన్‌రైతుకు మిగిలిన ఆ [illegible] పెద్ద దిక్కు అదృశ్య మైంది; వెలుగు చూపుతుండిన దీపం ఆరిపోయింది.

భారత రాజకీయాలలో ఆయనొక విలక్షణ వ్యక్తి; విశిష్టమైన శక్తి. పదవులను తృణ ప్రాయంగా ఎంచి, ప్రజా సేవే నాయకుడికి పరమావధి అన్న సూత్రాన్ని మనసావాచా ఆచరించిన ఆయన వంటి నేత భారతదేశంలో మరొకరు పుట్టలేదు; ఇక పుట్టబోరు. తాను తలుచుకొని వుంటే మంత్రిత్వాలు, గవర్నర్ గిరుల నుంచి, ఉప ప్రధానిత్వం వరకు ఏ పదవైనా కాళ్ల దగ్గరకు నడచి వుండేది. కాని వాటిని ఆయన గడ్డి పోచలతో సమానంగా తిరస్కరించారు. కడ వరకు నిజమైన ప్రజానేతగానే బ్రతికారు.

ఆ మహానాయకుడికి, మహామాన్విత మూర్తికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి.

## వరిపైరు

8 పేజీ కొరవ

### పచ్చ దీపపు పురుగులు

ఆకు పచ్చటి తల్లి పురుగులు, పిల్ల పురుగులు, ఆకుల నుండి రసాన్ని పీల్చి వేయటమే గాక 'టుంగ్రో' వైరస్ తెగులును కూడా పైరులో వ్యాప్తి చేస్తాయి. ఈ పురుగులు తొలకరిలో మొదలై బెట్ట వాతావరణంలో ఎక్కువగా వృద్ధి చెందుతాయి. దుబ్బుకు పురుగులు ఆశించగానే క్రిమి సంహారక మందులు వాడాలి. అదే టుంగ్రో వైరస్ వ్యాప్తి చెందితే దుబ్బుకు 1 - 2పురుగులు కనబడిన వెంటనే సస్యరక్షణా చర్యలను తప్పక చేపట్టాలి. ఈ పురుగుల నివారణకు కార్బో ఫ్యూరాగ్ గుళికలను ఎకరానికి 10 కిలోల చొప్పున పైరులో 2 అంగుళాలు నీరున్న సమయంలో వెదజల్లాలి. ఆ తర్వాత మందు నీరు ఇంకినంత వరకు నీరు పెట్టటం, తీయటం జరుగ కూడదు. ఇది వీలుకాకపోతే మానో క్రోటోఫాస్ 1.6 లి. లేక ఫాస్ఫామిడాన్ 1.0 మి.లీ. లేదా కార్బరిల్ 3 గ్రా. చొప్పున లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి. ఒకసారి వాడిన మందును రెండవసారి వాడరాదు.

### వరికంపు నల్లి

బూడిద రంగులోని పెద్ద పురుగులు, ఆకు పచ్చటి పురుగులు వరి పైరు పూత దశ నుంచి ఆశించి నష్టం కలుగ జేస్తాయి. పాలుపోసుకునే దశలో ఈ పురుగులు వెన్నులలోని గింజల నుండి రసాన్ని పీల్చి వేయడం వల్ల తాలుగింజలు ఎక్కువగా వస్తాయి. గింజల మీద నల్లటి మచ్చలు ఏర్పడి గింజ నాణ్యత తగ్గిపోతుంది. ఈ పురుగులను తాకితే నల్లి వాసన (దుర్వాసన) వస్తుంది. ఈ పురుగు నివారణకు మోనో క్రోటోఫాస 1.6 మి.లీ. లేక క్లోరి పైరిపాస 2.5 మిల్లీ గాని ఒక లీటరు నీటికి కలిపి చల్లని సమయంలో పిచికారి చెయ్యాలి. పురుగు ఉధృతి ఎక్కువగా వుంటే మొదల డై క్లోరోమిస 1.0 మి.లీ. మందును పై మందులతో కలిపి పిచికారి చెయ్యాలి.

ఈ విషయాలను దృష్టిలో వుంచుకుని రైతాంగం సకాలంలో తగిన సస్యరక్షణా చర్యలను తీసుకుని, మంచి దిగుబడులను సాధించ గలరని ఆశిస్తాను.

**చంద్రబాబు**

(5పేజీ కొరవ)

### హరికృష్ణకు పరీక్ష

తెలుగుదేశం పార్టీలో ఐదో అధికార కేంద్రంగా ఎదుగుతున్న హరికృష్ణ పట్ల ఎన్టీఆర్ ఆశలు పెంచు కుంటున్నారు. రాజకీయాల్లో హరికృష్ణ నిలబడతాడా? లేదా! అన్న విషయమై హరికృష్ణకు ఎన్టీఆర్ పరీక్ష పెడుతున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా హరికృష్ణ పట్ల రోజు రోజుకూ పెరుగుతున్న స్పందన ఇలాగే కొనసాగితే భవిష్యత్తంతా హరికృష్ణదేనని ఎన్టీఆర్ తన సన్నిహితులతో అంటున్నాడట. అంటే అటు అల్లుళ్ళకు, ఇటు అర్ధాంగికి కూడా మొండి చేయేనా? అన్నది నిలకడ మీదగాని తెలీదు.

## పెండ్లిండ్లు

8 పేజీ కొరవ

పైకెదిగినా ఆ పాత తత్వం మాత్రం వదల లేకున్న శ్రీ పూటుకూరు బ్రహ్మారెడ్డి కుమారుడు డాక్టర్ సత్యారెడ్డి బిడిఎస్; తిరుపతి, శ్రీ దేవిరెడ్డి చంద్ర శేఖర రెడ్డి కుమార్తె ఉమా భాను బిడిఎస్‌ల పెండ్లి 14 తేది నెల్లూరు టిటిడిలో ఆడంబరంగా జరిగింది.

ప్రేమ వివాహమైనా కులం గోత్రాల అభ్యంతరం ఎదురు కాక పోవడంతో పాటు, కలిమి కూడా కలసి రావడం బ్రహ్మారెడ్డి అదృష్టం.

## నెల్లూరు ముచ్చట్లు

12 పేజీ కొరవ

శోభిత లక్ష్మి 482 మార్కులతో రెండవ ర్యాంకు; కోవూరు, సెయింట్‌పాల్ ఇంగ్లీషు మీడియం విద్యార్థిని వి. విజయ లక్ష్మి 461 మార్కులతో మూడవ ర్యాంకు సాధించారు.

### కొత్త డిపిఆర్ఒ

నెల్లూరు కొత్త పబ్లిక్ రిలేషన్స్ అధికారిణిగా శ్రీమతి ఎల్. స్వర్ణలత బాధ్యతలు స్వీకరించారు. పాత డిపిఆర్ఒ శ్రీ వేణుగోపాల రావు ఒంగోలుకు బదలీ అయ్యారు.

వేణుగోపాల రావు గారు ఆవాహన, విసర్జన లేని అధికారి. ఆయన హయాంలో డిపిఆర్ఒ ఆఫీసు పాడుబడి పోయింది. కొత్త అధికారిణి ఆ దుమ్ము దులిపి కళ తెస్తారో లేరో వేచి చూద్దాం!

### మరణం

పాత రోజుల్లో ప్రముఖ మైకా వ్యాపారి, స్వర్గీయ సన్నపురెడ్డి కృష్ణారెడ్డి గారి సతీమణి శ్రీమతి సన్నపురెడ్డి కౌసల్యమ్మ 1 తేది మరణించారు. ఆమె వయస్సు 85 సంవత్సరాలు. ఒకే ఒక కుమార్తె వున్నారామెకు.

కౌసల్యమ్మ గారు గుప్త దాత. చాలా దాన ధర్మాలు చేశారు. నెల్లూరు జయభారత్ ఆస్పత్రికి ఒకటిన్నర లక్ష విరాళం; గూడూరు ఎస్కెఆర్ కాలేజికి లక్షా 50 వేల విరాళం; కోవూరు లైబ్రరీ భవన నిర్మాణం వంటివి ఆమె దాన ధర్మాలలో కొన్ని.

వారి కుటుంబానికి మా సానుభూతి.

### విఆర్ కాలేజికి ర్యాంకుల పంట

ఆనం వివేకానంద రెడ్డి పెత్తనం స్వీకరించిన వేళా విశేష మేమిటో గాని, విఆర్ కాలేజిలో అన్నీ విచిత్రాలే జరుగుతున్నాయి. డిగ్రీ పరీక్షలలో విఆర్ కాలేజి విద్యార్థులు అనూహ్యంగా ర్యాంకుల మీద ర్యాంకులు సాధించుకొని వస్తున్నారు. గత వారం బికాం ర్యాంకులు తెలిసాయి. ఇప్పుడు బిఎస్‌సిలో ఏకంగా ఫస్ట్ ర్యాంకే సాధించారు. ఎస్. శైలజ అనే విద్యార్థిని 89.55 శాతం మార్కులతో యూనివర్శిటీ ప్రథమురాలుగా వచ్చారు. అదే కాలేజికి చెందిన కుమారి బి. త్రిపుర సుందరికి 88.83 శాతంతో మూడవ ర్యాంకు వచ్చింది.

విఆర్ కాలేజి పిల్లలు ర్యాంకులు సాధించేటట్లు అయ్యవార్లు పాఠాలు చెప్తున్నారంటే అద్భుతమే. ఇంకొంచెం మనసు పెట్టి పనిచేస్తే విఆర్ కాలేజి ఘనమైన గతం తిరిగి పునరావృత మౌతుంది.

ప్రియదర్శిని డిగ్రీ కాలేజి విద్యార్థిని కుమారి ఎం. సరిత 87.16 శాతం మార్కులతో 4వ ర్యాంకు సాధించారు.

ఈ విద్యార్థినులందరికీ మా హార్దికాభి నందనలు.

## పంచాంగం

8 తేది నుండి మృగశిరా కా[rte]... జరుగుచున్నది.

### ముహూర్తములు

14 తేది బుధవారం ఉదయం 9.4[illegible] గంటలకు వివాహ, ఉపనయన, వ్యాపారారంభములకు కర్కాటక లగ్నము

16 తేది శుక్రవారం ఉదయం 8.31 గంటలకు కర్కాటక లగ్నమున వివాహ, అన్నప్రాశన, అక్షరాభ్యాస, వ్యాపారములకు సముహూర్తము లున్నవి.

### జూన్ తిథులు

జ్యేష్ట శుద్ధ

| | | | |
|---|---|---|---|
| తే 10 | శని ద్వాదశి | సా.గ. | 4.56 వ |
| తే 11 | ఆది త్రయోదశి | సా.గ. | 2.45 వ |
| తే 12 | సోమ చతుర్దశి | ప.గ. | 12.43 వ |
| తే 13 | మంగళ పూర్ణిమ | ఉ.గ. | 10.00 [illegible] |

జ్యేష్ట బహుళ

| | | | |
|---|---|---|---|
| తే 14 | బుధ పాడ్యమి | ఉ.గ. | 7.05 వ |
| | తరువాత పూర్తిగ విదియ | | |
| తే 15 | గురు తదియ | రా.గ. | 3.10 వ |
| తే 16 | శుక్ర చతుర్థి | రా.గ. | 12.50 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

# వేణుగోపాలుని సేవకుడి పరలోక ప్రాప్తి!

మా శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానంనకు
వంశపారంపర్య ధర్మకర్తగా సేవచేసి
స్వామి వారి కృపా కటాక్షములు పొందిన దైవభక్తుడు



# శ్రీ ఆనం వెంకట రెడ్డి గారు

ఇహలోకాన్ని చాలించారని తెలిసి మేమెంతో విచారిస్తున్నాము. వారులేని లోటు దేవస్థానంనకు ఎవ్వరూ తీర్చలేనిది. వారికి స్వర్గలోక ప్రాప్తిని కలుగజేయమని వేణుగోపాలుని ప్రార్థిస్తున్నాము. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతిని తెలుపు కొంటున్నాము.

ధర్మకర్తల మండలి

## శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానం

మూలపేట - నెల్లూరు - 524 003.

# అన్న ఇచ్చిన పదవికి వన్నె తెస్తానంటున్న డేగా!

నెల్లూరు సంగతులు

రాష్ట్ర అర్బన్ హౌసింగ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన తర్వాత తొలిసారి నెల్లూరులో తన సంస్థ కార్యకలాపాలను శ్రీ డేగా నారసింహా రెడ్డి వివరించారు. 1989 - 90 లో ప్రారంభమైన తమ సంస్థ జిల్లాలో ఇంత వరకు 10, 687 ఇళ్లు నిర్మించిందని, నెలకు 1,050 రూపాయల ఆదాయం గలవారికి తమ సంస్థ ఇళ్లు కట్టిస్తుందని; లబ్ధిదారులు పట్టాలు కలిగిన ఇళ్ల స్థలాలు గాని, ఎమ్మార్వో ద్వారా నివాస స్థలం సర్టిఫికెట్‌గాని పొంది వుండాలన్నారు. ఈ పథకం క్రింద ఎంపికైన వారు 361 రూపాయలు ప్రభుత్వానికి చెల్లించ వలసి వుంటుందట. లబ్ధిదారుల్లో ఎస్.సిలకు 50 శాతం, ఎస్టిలకు 10 శాతం బిసిలకు 30 శాతం, ఇ.బి.సి.లకు పది శాతం లెక్కన గృహాలు మంజూరు చేస్తారట. లబ్ధిదారులు మంజూరైన గృహాలను బేస్ మట్టాల వరకు తమ సొంత డబ్బులతో నిర్మించు కోవాలని. దశల వారీగా ఇళ్లు కట్టేందుకు మంజూరయ్యే రుణం కోసం బ్యాంకులో ఖాతా తెరచు కొంటే మంచి దన్నారు. ఈ యేడాది మే 31 నాటికి లబ్ధిదారుల నుంచి కొట్టి 2 లక్షలు రూపాయల బాకీలు వసూలు చేయాల్సి వుండగా అందులో కేవలం రెండు లక్షలు మాత్రమే రికవరీ చేసినట్లు; ఇక నుండి దాన్ని వేగిర పరుస్తున్నట్లు చెప్పారు. జిల్లాలో నోటిఫైడ్ అర్బన్ ప్రాంతాలైన వెంకటేశ్వర పురం, పడారుపల్లి, వెంకటగిరి, కోవూరు, నాయుడు పేట, కోవూరు పల్లి, సూళ్లూరు పేటలతో పాటు మేజర్ పంచాయితీలలో కూడా ఇళ్లు కట్టించాలని సంస్థ భావిస్తున్నట్లు చెప్పారు. తన పై నమ్మకంతో ఎన్టీఆర్ తనకు అప్పగించిన బాధ్యతను నెరవేర్చి, సంస్థ పేరు ప్రఖ్యాతులు పెంచుతానని డేగా నారసింహా రెడ్డి గారు భరోసాగా చెప్పారు.

## మూత్రకోశ వ్యాధిగ్రస్తులకు ఇక భయం వలదు!

ఇప్పటి వరకు మూత్రకోశ వ్యాధులకు గురై, జిల్లాలో సరైన వైద్యం లేక బాధ పడుతున్న వారు ఇక నుండి నిశ్చింతగా వుండ వచ్చంటున్నారు డాక్టర్ ఎం. మోహన్ రాజు. పొగతోటలో అత్యాధునిక వసతులతో ఆయన నిర్మించిన శుశ్రుతా యూరోరీనల్ హాస్పిటల్ శుక్రవారం ప్రారంభోత్సవం జరుపు కొన్నది. ఈ ఆసుపత్రిలో కిడ్నీల మార్పిడి తప్ప అన్ని రకాల పిండ సంబంధ వ్యాధులకూ చికిత్స చేస్తారు. ఆహార పద్ధతుల్లో మార్పులు, పర్యావరణ సమస్యల వల్ల మూత్రకోశ వ్యాధులతో పలువురు బాధ పడుతున్నట్లు చెప్పారాయన. ఆస్పత్రిలో అత్యాధునిక స్వదేశీ, విదేశీ పరికరాలతో ఓపెన్ సర్జరీ, బ్లాడర్ ట్యూమర్, రాళ్లు తీయడం, ఎండోస్కోపి, మైక్రో స్కోపి, కీహోల్ సర్జరీ చేసే సదుపాయాలు వుంటాయని చెప్పారు. సరికొత్త లాబొరేటరీ, సుశిక్షితులైన వైద్య సిబ్బందితో పాటు లాభాపేక్ష లేకుండా సామాన్యులకు అందుబాటులో వుండేవిధంగా వసతులు ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు. తనతో పాటు మరో నెఫ్రాలజిస్ట్ పని చేస్తారని, ఇప్పటి వరకు పెద్ద పెద్ద సిటీలలో వైద్యం నెల్లూరుకు తెస్తున్నట్లు వివరించారు. మోహన్ రాజు గారికి ఢిల్లీలోని ఆలిండియా మెడికల్ సైన్సెస్ వంటి ప్రతిష్టా కరమైన సంస్థలో పనిచేసిన అనుభవం వుంది. సామాన్యులకు అందుబాటులో చికిత్స వుంచినప్పుడు తప్పకుండా ఆయన క్లినిక్ విజయ వంత మవుతుందనడంలో సందేహం లేదు.



రామానాయుడు జయంతి సన్మానం పాత్రూరు వెంకటేశ్వర రావు అందజేస్తున్న ఏ.వి. రమణారెడ్డి, జమీన్‌రైతు మేనేజరు తూపిలి వనమాలి

## దేముడితో ముఖాముఖి గ్రంథావిష్కరణ సభ!

11 తేది టౌన్‌హాల్‌లో రచయిత శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు రచించిన దేవుడితో ముఖాముఖి గ్రంథావిష్కరణ సభ జరుగుతుంది. వర్ధమాన సమాజం ఆధ్వర్యంలో జరిగే ఈ సభకు వామ్మిన సుబ్రహ్మణ్యం అధ్యక్షిస్తారు. పినాకిని దేవదేశిస్ శ్రీ బోడా చిదంబరం సభను ప్రారంభిస్తారు. కొండా బలరామిరెడ్డి గ్రంథాన్ని ఆవిష్కరిస్తే గంగాధరానంద స్వాములు, సిసి సుబ్బరాయు గ్రంథాన్ని సమీక్షిస్తారు. సాహి అభిమానులను తరలి రమ్మంటున్నా సమాజం అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ ఏ. రమణారెడ్డి, శ్రీ బి.వి. నరసింహం.

## ఇంధన సంక్షోభానికి ప్రత్యామ్నాయాలు!

ప్రత్యామ్నాయ ఇంధ వనరులైన గాలి, సౌరశక్తి, బయో గ్యాస్‌లను వినియోగంలోకి తేవడం వ భవిష్యత్తులో ఇంధన సంక్షోభాన్ని అధి మించవచ్చని ఇండియన్ రెన్యువబు ఎనర్జీ డెవలప్‌మెంట్ ఏజెన్సీ ఎం.డి డాక్టర్ వి. భక్తవత్సలం సూచించారు.

కొరవ 22 పేజీలో

# అశ్రుతర్పణం



మా కళాశాల వ్యవస్థాపకులు
కమిటీ గౌరవాధ్యక్షులుగా కాలేజి
అభివృద్ధికి ఎంతగానో
సహకరించిన, నిగర్వి, నిరాడంబరుడు

## శ్రీ ఆనం వెంకటరెడ్డి గారు

పరమపదించడం మాకు తీరని లోటు
ఆ మహానాయకుడికి అశ్రుతర్పణం గావిస్తూ,
వారి కుటుంబానికి ప్రగాఢ సానుభూతిని
తెలియజేస్తున్నాము

ప్రిన్సిపల్, అధ్యాపకేతర సిబ్బంది
శ్రీ వేణుగోపాలస్వామి జూనియర్ కాలేజి
నెల్లూరు

కెటు - డూప్లికేటులో సురభి, రాజేంద్రప్రసాద్

# అర్ధ నగ్నానికి నగ్మా ఫుల్‌స్టాప్ పెడ్తుందా?

ఆ విషయం ఎంత వరకు నిజమో. కాని వాహినీ స్టూడియోస్‌లో కనిపించిన నగ్మాను అడక్కుండా వుండలేక పోయాను. ఆమె అదోలా నవ్వి. "అవును మీరు విన్నది నిజమే. ఇది

**రెండు అవార్డులు వస్తేనే పెళ్ళి చేసుకొంటుందట!**

వరకు ఎక్స్‌పోజ్ చేసినట్లు ఇటుపైన ధారాళంగా నా సొగసులు చూపించ దలచలేదు. నేను చూపించకపోతే నేడు తెలుగు సినీ ఫీల్డులో అలా చూపించ డానికి ఎంతో మంది సిద్ధంగా ఉన్నారని నాకు తెలుసు. ఫరవాలేదు నగ్మా బాగా నటిస్తుంది అనిపించు కున్నాను. అంచేత, ఇటుపైన ప్రాధాన్యత గల పాత్రలనే అంగీకరిస్తాను. రెండు మూడు అవార్డులు కొట్టేశాక ఆ తర్వాత నా పెళ్ళి గురించి ఆలోచిస్తాను" అంది.

"శుభం, అన్నట్లు మీకు, రమ్యకృష్ణకు మాటలు లేవట?"

నగ్మా విస్మయంగా చూసింది. "ఈ విషయం మీ వరకు వచ్చిందన్న మాట. మాటలు లేక పోవడానికి కారణం ఒకటే. హిందీ సినీ ఫీల్డులో నాకో

కొరవ 20 పేజీలో





సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా
సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా

# పెళ్ళి క్యాన్సిలై సినిమా ఛాన్సు!

"నా నటనను 'బాజీగర్' హిందీ చిత్రంలో శేషన్ ఎంతో మెచ్చు కున్నారు సుమండీ" అంది శిల్ప శెట్టి మిస్టర్ రోమియో అనే తమిళ చిత్రం సెట్‌లో. ఆ చిత్రంలో ఆమె పారితోషికం పాతిక లక్షలట. "అసలు నేను సినిమాలలో నటిస్తానని అనుకోలేదు. మా స్వస్థలం బెంగుళూరు. మాతృభాష తుళు. కాలేజి చదువు పూర్తి చేసిన వెంటనే మా అమ్మా నాన్నా నా పెళ్ళి తలపెట్టారు. వర దక్షిణ లకారాలంలో! పెళ్ళి రోజు దగ్గర పడే కొద్దీ ఆ డబ్బు కోసం వాళ్ళు ఒత్తిడి చేయసాగారు. మా నాన్న గారు ఒకేసారి అంత మొత్తం సమీకరించ లేకపోయారు. ఇక లాభం లేదనుకొని పెళ్ళి కొడుకు వైపు వారు తప్పుకున్నారు. నేనేం బాధ పడలేదు. లక్ష రూపాయలు పోసి పెళ్ళి కొడుకును కొనాలా? అంత కర్మ నాకేం పట్టింది అనుకున్నాను. ఒకరి దయతో సినిమా రంగంలో పాదం మోపాను. పరిస్థితి బాగుంది. ఇప్పుడు నన్ను చేసుకుంటానని ఎంత మంది ఉత్తరాలు రాస్తున్నారో తెలుసాండీ! చాలా మంది నాకే

కట్నం చెల్లిస్తా నంటున్నారు" అని నవ్వింది శిల్ప. ఆమె టైమ్ బాగుంది.

## జమున కుమార్తె స్రవంతి నటి అవుతుందట

మాజీ నటి జమున కుమార్తె స్రవంతి 15వ పుట్టిన రోజు సందర్భంగా జమున "మా అమ్మాయి ఇటీవలే 10 వ తరగతి పరీక్షలు రాసింది. నాలాగే సినీ నటి అవ్వాలని దాని ముఖం మీద రాసి వుంది కాబోలు. సినిమాల్లో నటించాలని ఉబలాట పడుతున్నట్లు

**వరకట్నం విషాద గాధ శిల్ప జీవితానికి వరప్రసాదితమైంది!**

నాతో చెప్పింది సరే... నీ అదృష్టం పరీక్షిద్దాం" అన్నాను; నా ప్రోత్సాహం తప్పకుండా ఉంటుం దనుకోండి. అభినయం, నాట్యంలో శిక్షణ పొందుతోంది. నేను డైరెక్ట్ చేసే సీరియల్ "డాక్టర్ మమత" లో తొలిసారిగా నటిస్తోంది అని చెప్పింది జమున. జమున ఒక విషయం గ్రహించాలి. సినిమా రంగం పరిస్థితులు అప్పటికీ ఇప్పటికీ ఎంతో మారిపోయాయి. ఎటొచ్చీ స్రవంతి సినిమా రంగ ప్రవేశానికి ఆశీస్సులు అందజేయక తప్పదనుకోండి. చూద్దాం - స్రవంతి ఎంత త్వరితగతిన తారా పథాన్ని అందు కుంటుందో!

## మోహన్‌బాబు జయంతి మధ్య సయోధ్య

"పెదరాయుడు" చిత్రం షూటింగ్ సందర్భంలో రాజ్యసభ సభ్యుడు నటుడు మోహన్ బాబు, సీనియర్ నటి జయంతి పై చెయ్యి చేసుకున్నాడని ఆరోపణ. మోహన్ బాబు కాస్త తొందరపడే స్వభావం కలవాడని అతడ్ని ఎరిగున్న వారందరికీ తెలుసు. కాని. నేను "చీమకు కూడా హాని తలపెట్టనే, నా మీదనా ఈ అభాండం" అని మోహన్ బాబు తన బాధను వ్యక్తం చేశాడట. సరే... సయోధ్య కుదర్చ డానికి దాసరి నారాయణ రావు ఉండనే ఉన్నారు. ఇరువైపుల వారి వాదనలు విని, ఇదొక దురదృష్ట కరమైన సంఘటన. సినిమా షూటింగ్‌లలో ఇలాంటి సంఘటనలు జరగడం సహజమే. వాటిని పరిష్కరించు కోడానికి మూవీ ఆర్టిస్ట్ అసోసి యేషన్ వంటి మన సంఘాలు ఎన్నో ఉండగా పత్రికలలోకి ఎక్కడ మెందుకు?" అంటూ వాళ్ళిద్దరి మధ్య సయోధ్య కుదిర్చి, అనవసరంగా పత్రికలకు ఎక్కరాదని తీర్మానించారట. ఇది ఆచరణ సాధ్యమా?

## ...జయంతి

7 పేజీ కొరవ

...పాయల బియ్యం పథకం వంటి వాటి ...ల్ల దేశానికి ఆర్థికంగా ఎంతో నష్టం ...రుగు తున్నది. కాని ఆ మాట ...ప్పేందుకు ఎవరికీ ధైర్యం లేదు. ఏ ...ంపాదకుడికి కూడా స్వేచ్ఛ లేదు. ...జమాన్యం అవసరాలు, అడ్వర్‌టైజ్ ...మెంట్ల అనుకూలతలు, సర్క్యులేషన్ ...విభాగం ఆదేశాలు పరిగణనలోకి ...తీసుకొని వార్తలు వ్రాయాలి. పంజాబ్‌లో ...లాలా జగత్ నారాయణ్‌ను, అతడి ...కొడుకును, పత్రిక ఏజంట్లను, రిపోర్టర్లు, ...సబ్ ఎడిటర్లను 46 మందిని ...తీవ్రవాదులు కాల్చి చంపారు. కాని ఆ ...పత్రిక తీవ్రవాదాన్ని వ్యతిరేకించడం మానలేదు. అంతటి ధైర్యం, త్యాగ గుణం కల్గిన వారు ఎందరుంటారు? తెలుగు వార పత్రికలు నిర్వహించాలన్నా కష్టంగానే వుంది. ప్రజలు కోరు కొంటున్నారని సెక్స్‌ను, చక్కిలిగిలి పెట్టే కథలను, మనిషిలోని పాశవికతలను తట్టి లేపి, భ్రాంతి కల్గించే నవలలను ప్రచురించాలి. ఇవి సమాజానికి ఏ విధంగానూ వుపయోగ పడవు. సినిమాల తర్వాత సమాజాన్ని పతనం చేస్తున్నది పత్రికలే అన్నారు పొత్తూరు వెంకటేశ్వర రావు గారు.

రానున్న రోజులలో ఇక్కాలజీ పత్రికలను కాని స్తుందన్నా రాయన. పత్రికలు తమ భాషను, రైమింగ్‌ను సంకరం చేయకుండా, ఎంతో జీవం కల్గిన మాండలికాలను, నుడి కారాలను పోషించాలని అభిలషించారు.

పొత్తూరు వెంకటేశ్వర రావు గారికి శ్రీ పివి రమణా రెడ్డి గారు, జమీన్‌రైతు మేనేజరు శ్రీ తూపిలి వనమాలి శాలువ కప్పి, సన్మాన మందజేశారు. పత్రికా సంపాదకుడు నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ తొలుత స్వాగతం చెప్పా, రామానాయుడు జయంతి పురస్కారాల చరిత్రను సంక్షిప్తంగా చెప్పారు. శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, సన్మాన గ్రహీతను పరిచయం చేశారు. సబ్ ఎడిటర్ శ్రీ అల్లూరు రహీం వందనాలు చెల్లించారు.

# ఉత్తరక్రియలు

మా తండ్రి

## కొల్లూరు రాధాకృష్ణమూర్తి గారు

4.6.95 తేదిన ఆకస్మికంగా స్వర్గస్థులైనారు దశాహన్ను 13.6.95 తేదిన జగదర్తి మండలం దుండిగం గ్రామంలో మా స్వగృహమున జరుగును.

కె.వి. మురళీధర రావు కె.వి. సుబ్బారావు

## చచ్చు కథకు చెత్త చిత్రీకరణ

# బాలరాజు - బంగారు పెళ్ళాం

**చిత్రసమీక్ష**
**అల్లూరు రహీం**

తెలుగు సినిమా అధ్వాన్న స్థితిలో వుందంటే; దానికి ప్రధాన కారణం కథ, కథనంలో కాసింత కూడా నవ్యత లేని చిత్రాలు తీస్తుండడమే! ఇటువంటి చిత్రాలను ఏ ధైర్యంతో నిర్మాతలు తీస్తున్నారో తలచు కొంటేనే ఆశ్చర్య మేస్తుంది. ఈ అధ్వాన్నపు జాబితాలోని చిత్రమే బాలరాజు బంగారు పెళ్లాం. కథకు టైటిల్‌కు ఏ మాత్రం సంబంధం లేదు; బాల రాజు - కిరాయి పెళ్లాం అంటే బాగుండేదేమో. ఈ చిత్రంలో ఒక్క సన్ని వేశంలోనూ నవ్యత కన్పించదు. ప్రతివీ ఏదో సినిమాలో చూసినట్లుగా వుంటాయి. కథ పరమ పేలవం - కథనం దాన్ని మించింది. ఉబ్బులిచ్చి ప్రేక్షకులు తలలు బద్దలు కొట్టించుకొనే ఈ చిత్రానికి వై. నాగేశ్వర రావు దర్శకుడు. ఒక మహిళా నిర్మాత అయి వుండి కూడా మాటల రచయిత చేత చవక బారు డైలాగులు వ్రాయించింది. హీరోయిన్, హీరోను తన దారిలోనికి తెచ్చుకోను విఫల మౌతుంది. దానికి కారణం అంటూ హీరోయిన్ తండ్రి ఆమెలోనే అయస్కాంతంలో పవర్ వుండాలి అంటాడు. ఒక తండ్రి తన కుమార్తెతో ఈ మాట అనగలడా? పొలంలో పని చేస్తున్న హీరోను హీరోయిన్ తొక్కుడు బిళ్ల ఆడుకొందామని పిలుస్తుంది. బహుశా సెన్సార్ సభ్యులు కునుకులు తీస్తూ ఈ సన్నివేశాలను వదిలేశారేమో!

ఇక కథలోకి వస్తే గ్రామ ప్రెసిడెంట్ భూపయ్య (సత్య నారాయణ) కుమారుడు బాలరాజు (సుమన్). అంద గాడైన అతడ్ని పెళ్లి చేసుకోవాలని గ్రామంలో పలువురు కన్యలు తహతహ లాడు తుంటారు. అతని మరదలు నాగమణి (ఇంద్రజ) ఒక అడుగు ముందుకేసి ఒక రాత్రి పక్కలో కూడా దొంగ చాటుగా దూర్తుతుంది. ఈ బాధలు పడలేక బాలరాజు తల్లి పూర్ణ (అన్నపూర్ణ) అతడ్ని పట్నం పంపాలని తలపోస్తుంది. నాగమణి తండ్రి బసవయ్య (కోట శ్రీనివాస రావు) ఒక ప్లాన్ వేసి ప్రమాదంలో గాయ పడినట్లు నటించి భూపయ్య ద్వారా నాగమణి - బాలరాజులకు పెళ్లి చేస్తానన్న ప్రమాణం తీసుకుంటాడు. ఈ స్థితిని తప్పించుకోను పట్నం వెళ్లిన బాలరాజు, వైజయంతి (సౌందర్య) ని వెంట పెట్టుకొని తన భార్య అంటూ తీసుకొని వస్తాడు.

వాస్తవానికి వైజయంతి ఒక నాట్యకత్తె. తనను వెరచ బోయిన అబ్బులు బారి నుండి రక్షణ కోర ఎక్కువ కిరాయి ఆశతో బాలరాజు పంచన చేరుతుంది. కాలక్రమేణ గ్రామంలో అందరి మన్ననలూ పొందుతుంది. చివరికి మనసు మారిన బాలరాజు ఆమెను తన జీవితంలోకి ఆహ్వానిస్తే తిరస్కరిస్తుంది. ఈ తిరస్కారం వల్ల ఆ క్యారెక్టర్ వున్నతిని కోల్పోయింది.

సినిమాలో చాలా భాగం నెల్లూరు రూరల్ మండలంలో గ్రామీణ నేపథ్యంలో సన్నివేశాలు చిత్రీకరించారు. కాని కాసింత కామెడీ గాని సస్పెన్స్ కాని చొప్పించక పోవడం వల్ల సినిమాకు వెళ్లిన వారు బోర్ ఫీల్ అవుతారు. కీరవాణి స్థాయిలో సంగీతం లేదు. తోటపల్లి మధు మాటలు; వేటూరి, భువన చంద్ర పాటలు అదే కోవలో సాగాయి. కెమరా మరీ ఘోరంగా వుంది. సాంకేతిక నిపుణు లందరి చేతా పని చేయించడంలో దర్శకుడు విఫల మయ్యాడు. అదే విధంగా నటనా పరంగా సుమన్, ఇంద్రజ, సౌందర్య, సత్యనారాయణ, కోట శ్రీనివాస రావులను సరిగ్గా ఉపయోగించు కోలేక చచ్చు చిత్రాల జాబితాలో బాలరాజు బంగారు పెళ్లాంను ఒకటిగా చేర్చాడు.

## పొన్నవోలు శశిధర్

జననం: 24.2.1960
మరణం: 5.6.1995

5.6.1995 తేది అకస్మాత్తుగా స్వర్గస్థులైనారు.

# ఉత్తరక్రియలు

గురువారం 15.6.95 తేది మా స్వగృహం 58A రోడ్ నెం. 8, జూబ్లీ హిల్స్ హైదరాబాదులో జరుగును.

## శోకతప్త హృదయాలతో

తండ్రి - పొన్నవోలు శేషారెడ్డి
మామ - పెళ్ళూరు సుధాకర్‌రెడ్డి
తల్లి - సుజాతమ్మ
అత్త - జయప్రద
భార్య - ప్రతిమ
బావమరిది - పెళ్ళూరు శ్రీనివాసులురెడ్డి, ప్రసన్న
కుమారులు - దశరథరామిరెడ్డి, సాయిశ్రీ సందీప్‌రెడ్డి
సోదరి - రేబాల ప్రసూన
బావ - రేబాల కిషోర్‌కుమార్‌రెడ్డి
వదిన - పలగాటి రాధమ్మ - చంద్రశేఖర్‌రెడ్డి
మేనకోడలు - పూజిత
మేనల్లుడు - పృథ్వీ

మరియు పిల్లలు, బంధుమిత్రులు

# సాయిలో ఐక్యం చెందాడు!



మా మందిర అభివృద్ధికి
ఎంతో సహకరిస్తుండిన సాయి భక్తుడు

## శ్రీ ఆనం వెంకటరెడ్డి గారు



ఇక లేరంటే మాకెంతో దిగులుపుట్టున్నది
వారిని శ్రీ సాయిబాబా తనలో ఐక్యం చేసుకుని
దివ్యగతులు చూపాలని ప్రార్థిస్తూ,
వారి కుటుంబానికి మా సానుభూతిని తెలియపరుస్తున్నాము

సాయిభక్తమండలి

**శ్రీ షిర్డిసాయిబాబా మందిరం**

గాంధీనగరం - నెల్లూరు -1.
ఫోన్: 27771

## ఆనం వెంకటరెడ్డి

మొదటి పేజీ కొరవ

ఎలు చోట్ల హింసాత్మక మైంది. ఉద్యమాన్ని వ్యతిరేకించే వారిని ప్రజా ద్రోహులుగా చిత్రించే వారు. అటువంటి ఉద్రిక్త పరిస్థితులలో, కల్లోల వాతావరణంలో విశాలాంధ్ర వాదాన్ని బలపరచారు వెంకట రెడ్డి గారు. వేలాది జనం ఇంటి మీదకు దొమ్మీగా వచ్చినా లెక్క చేయలేదు. ప్రాణం పోతుందన్న భయాన్ని దగ్గరకు చేరనివ్వ లేదు. తన రాజకీయ భవితవ్యం సమాప్త మౌతుందన్న వెరపునూ లక్ష్య పెట్టలేదు. అంతటి తెగువ, తెంపు అసాధారణ మైనవి.

వెంకట రెడ్డి గారు ఎప్పుడూ ఎవరికి తలవంచి ఎరుగరు; ఏ ప్రలోభాలకు, పత్రిల్లకు లొంగలేదు. జీవిత మంతా వెన్ను చూపని సైనికుడి వలె రాజకీయాలు నెరపారు. ఏ దశలోనూ ఎవరికి అనుచరుడిగా వుండకుండా, స్వతంత్రుడిగా మన గలగడం ఆయన ప్రత్యేకత. జిల్లాలో తానెప్పుడూ తన వర్గానికి నాయకుడే; ఇంకొక నాయకుడిని అనుసరించే, ఇంకొక వర్గంలో సభ్యుడిగానో పనిచేయలేదు.

వీటన్నింటిని మించినది - ఆయనలోని నిజాయితీ. 70 ఏళ్ల పాటు ప్రజా జీవితంలో గడిపితే ఒక్కటంటే ఒక్క అవినీతి ఆరోపణ సైతం ఎవరూ చేయలేక పోయారు ఆయన పైన. జిల్లాను శాసించే స్థాయిలో వుండిన ఆయనకు వుండడానికి వారసత్వంగా వచ్చిన ఇల్లు తప్ప, ఒక్క సెంటు పొలం లేదు; ఒక్క అంకణం స్థలం సంపాదించ లేదు; తాతల నుంచి వచ్చింది నిలుపు కోలేదు; ఎవర్నీ ఎప్పుడూ ఏదీ యాచించలేదు. రాజకీయాలలో అత్యంత అరుదైన వ్యక్తిత్వం అది.

వెంకట రెడ్డి గారు అనుభవించిన పదవులు కొంచమే. 1930 ప్రాంతాల నుంచి రాజకీయాలలో వున్నా, తెర ముందుకు వచ్చింది 1964లోనే. జిల్లా కో ఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షత ఆయన తొలి పదవి. 1967 లో నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్‌గా గెల్చారు. 1972 లో నెల్లూరులోనే ఎమ్మెల్యే అయ్యారు. 1973లో జై ఆంధ్రా ఉద్యమం తర్వాత హోం మంత్రి పదవి లభించింది కాని, అది వారం రోజుల్లోనే వూడిపోయింది. తిరిగి 1974 లో వెంగళ రావు మంత్రి వర్గంలో మైనర్ ఇరిగేషన్ శాఖ చేపట్టారు. చివరగా 1983లో ఆత్మకూరు నుంచి తెలుగు దేశం శాసన సభ్యుడిగా గెల్చారు. ఆయన జీవితంలో అదే ఆఖరి పదవి.

నెల్లూరులో స్పిన్నింగ్ మిల్, కన్స్యూమర్ కో ఆపరేటివ్ స్టోర్స్ స్థాపించింది వెంకట రెడ్డి గారే. వి.ఆర్ కాలేజి కమిటీకి, వేణుగోపాల స్వామి దేవాలయానికి చాలా కాలం అధ్యక్షుడిగా వుండినారు.

రాజకీయాలలో మొండి తనం పలు మార్లు వెంకట రెడ్డి గారిని నష్ట పరచింది. ఎవరెన్ని చెప్పినా వినకుండా 1977 లో ఆయన జనతా పార్టీలో చేరారు. 1978 లో నెల్లూరులో ఆనం సుబ్బారెడ్డి చేతిలో ఓటమి రుచి చూశారు. 1984లో అటు వంటి తొందర పాటుతోనే పొరపాటు చేసి నాదెండ్లతో చేతులు కలిపారు. దాన్ని తిరిగి సరిదిద్దుకొనే అవకాశం ఆయనకు మళ్లీ లభించలేదు. దాని తర్వాత ఆయన ప్రత్యక్ష రాజకీయాలకు దూరమై పోయారు.

వెంకట రెడ్డి గారి మరణంతో, ఆనం వంశంలో ఒక శకం పరిసమాప్త మైంది. ఒక తరం గడచి పోయింది. బ్రతికి నంత కాలం ఆయన పులి వలెనే బ్రతికాడు. మరణంలోనూ ఆ హుందాతనం నిలబెట్టు కున్నాడు. తన మరణా నంతరం తన కళ్లను దానం చేయాలని కోరడం ద్వారా ఆయన తన ఔన్నత్యాన్ని మరింత పెంచు కున్నారు.

ఆయనకు 85 ఏళ్ల వయస్సు, భార్య, నలుగురు కుమారులు, ఒక కుమార్తె. తన కుమారులలో రామ నారాయణ రెడ్డి మంత్రి కావడం, వివేకానంద రెడ్డి మునిసిపల్ ఛైర్మన్ కావడం కళ్లారా చూడగల్గడం ఆయన అదృష్టం.

వర్గ రాజకీయాలు తప్ప, అభివృద్ధికర కార్యక్రమాల పట్ల ఆసక్తి లేకపోవడం వెంకట రెడ్డి గారిలోని పెద్ద లోపం. తన మాట ధిక్కరించిన వారిలో జడుపు జ్వరం తెప్పించే నియంత వలె బ్రతికిన వెంకట రెడ్డి గారు, ఆ అధికారాన్ని వుపయోగించి ప్రజల కుపయోగపడే పనులు చేయలేక పోయారు. అందువల్లే స్వర్గీయ ఎసి వలె ఆయన జనాభి మానం పొందలేదు. ఈ ఒక్క తేడా తప్ప, ఎసితో సరిపోల్చ దగిన నాయకుడు వెంకట రెడ్డి గారు.

వారి కుటుంబానికి జమీన్‌రైతు ప్రగాఢ సంతాపం తెలియ జేస్తున్నది.

## వేలం ప్రకటన

పెద్దాపురం
సబ్ జడ్జి కోర్టులో
K.S. O.S. 63/79 :: E.P. 34/90
సుదర్శన్ చిట్స్ ఇండియా, కాకినాడ -DHr
and
కోరపురెడ్డి వెల్లారావు వగైరా -JDrs

పై నెంబరు డిక్రీ బాకీకి 1st JDr లేటు కోరపురెడ్డి వెల్లారావు తేదులో 2 and 6 & 7 JDrs స్వాధీనంలో గల యీ దిగువ షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పై కోర్టు వారి ఎదుట 20.6.95 తేదీ పగలు 10.00 గంటల లగాయతు. వేలం కాబడును. కావలసిన వారు పాడు కోవచ్చును. మిగతా వివరాలు కోర్టు నాజరు గారి వద్ద తెలియజేయ బడును.

### షెడ్యూలు

తూ.గో. జిల్లా ప్రత్తిపాడు సబ్‌డి.లో చేరిన సత్తిపూడి గ్రామం తాలూకు జిరాయితీ మెరక S.No. 223/2, వూరాలో గల పెంకుటింటికి హద్దులు. ఎకరా 0.26 సెంట్లు అనగా 0.40 హె. లోగల వార్డు నెం1, యింటి నెం. 4/87.

తూర్పు: పాదనాల సత్తిరాజు భూమి; దక్షిణం: కోరపురెడ్డి అప్పలరాజు జిరాయితీ; పడమర: గాజు పాపారావు జిరాయితీ; వుత్తరం: రాజవీధి

సదరు హద్దులు మధ్యస్తమైన భూమి అందలి పెంకుటియిల్లు, పేకు తలుపులు, ద్వారబంధంలు నానా విధ ఫల వృక్షములు మామూలు మార్గంలో యీజిమెంటు హక్కులు వగైరాలతో సహా.

| | |
|---|---|
| JDr Value | Rs. 6,000 |
| అమీనా కిమ్మత్తు | రూ. 45,000 |
| పెద్దాపురం సి.ఎల్. నారాయణరావు | |
| 2.6.95 | వాది తరుపు అడ్వకేటు |

## ప్రమాదం

11 పేజీ కొరవ

కోవలోనిదే. టౌన్ వుత్తరపు పొలిమే[illegible] అభిరామ కాటన్ మిల్లు సమీపంగా మద్రాసుకు వెళ్తున్న ఒక లారీ, సత్యవేడు నుంచి నెల్లూరు వైపు వస్తున్న ఆర్టిసి బస్సును ముఖా ముఖిగా గ్రుద్దింది. లారీ ఎంత వేగంతో వస్తుందిందో కాని, ఆ అదురుకు రెండు బండ్లూ తుక్కు తుక్కు అయిపోయాయి. పదిహేను మంది చనిపోయారు.

హృదయ విదారకమైన, పరమ జుగుప్సా కరమైన సన్నివేశం అది. లారీ ముందు భాగం, బస్సు లోపలకు చొచ్చుకొని పోవడం వల్ల అనువ రేకులు కత్తుల వలె పనిచేసి ఇద్దరు డ్రైవర్ల శరీరాలను చీల్చి పారేశాయి. బస్సులో వున్న వారిలో పదకొండు మంది సీటు కమ్ములకు గ్రుద్దుకొని తలలు పగిలి, చేతులు కాళ్లు విరిగి అత్యంత ఘోర మరణానికి గురైనారు. చేతులు, భుజాలు, కాళ్లు చీరుక పోయి మాంసం వెలికి వచ్చిన వాళ్లు; తల పగిలి మెదడు బయటకు జారిన వారు, రక్తపు మడుగులో తేలి యాడిన వారు... ఆ దృశ్యం చూస్తుంటే కడుపులో చెయ్యి పెట్టి దేవినంత ఘోరంగా వుండింది.

లారీలో మేకల తెస్తుండినారు. ఈ ప్రమాదానికి వాటిలో చాలా భాగం చనిపోయాయి. వాటి అవయవాలు, మాంస ఖండాలు తెగపడి, రోడ్డంతా చెల్లాచెదురై మరింత భయానక దృశ్యం సృష్టించాయి.

మొత్తం 15 మంది మరణించారీ ఘోర ప్రమాదంలో. అందులో 8 మంది అక్కడి కక్కడే [illegible]. ఐదుగురు సూళ్లూరుపేట [illegible] ఇద్దరు మద్రాసులో [illegible]. వీరిలో ఆరుగురు పురుష[illegible], నలుగురు మహిళలు, [illegible]గురు పిల్లలు, నాయుడు పేటకు [illegible] ఆగళ్ గోవింద స్వామి అనే [illegible]గ్యుడిది మరీ జాలి కొల్పే పరిస్థితి [illegible] కుటుంబానికి చెందిన ఐదుగురు ఒకేసారి మరణించారు. చెంగాళమ్మ గుడిలో రాత్రి నిద్ర చేసి, తెల్లవారి ఇంటికి వెళ్తుండి నారట. ఆ తల్లి దెంత కఠిన హృదయమో, తన భక్తులన్న జాలి కూడా లేకుండా అందర్నీ మృత్యువు పొట్టన పెట్టు కొంటుంటే చూస్తూ వుండి పోయింది. భార్య, ముగ్గురు బిడ్డలు, మరదలు తన కళ్ల ముందు విగత జీవాలుగా మారి పోతే అతడి హృదయం ఎంత క్షోభించి వుండాలో పాపం. ఇద్దరు మహిళలు తమ పిల్లలను తమ చేతుల్లో నుంచే మృత్యువుకు అప్పగించారు. వీరు చెంగాళమ్మ గుడి నుంచి ఇంటికి వెళ్తున్నవారే! వారి శోకం ఆపడం ఎవరి తమూ కాలేదు.

ప్రమాదం ఉదయం 7 గంటల ప్రాంతంలో జరిగితే స్థానికులు అప్పటి కప్పుడు గాయపడిన వారిని ఆస్పత్రికి పంపేందుకు ఆరాట పడ్డారు కాని; ఆర్టిసి బిదా పోలీసు అధికారులలో ఆ తపన కన్పించలేదు. ప్రమాదం జరిగిన చోటుకి ఆర్టిసి డిపో కేవలం రెండు కిలో మీటర్ల దూరంలో వుంది. వారు ఏదో ఒక బస్సును పంపి, గాయ పడిన వారందరినీ వెంటనే ఆస్పత్రులకు తరలించి వుంటే కొందరి ప్రాణాలైనా రక్షింపబడి వుండేవి. ప్రమాదం జరిగిన మూడు నాలుగు గంటలకు కాని, ఆర్టిసి నుంచి వాహనాలు, అధికారులు రాలేదు.

మానవతా దృష్టితో, కళ్ల ముందు జరిగిన ఘోరానికి విచలితులై స్థానిక నాయకులు, డాక్టర్లు ఉరుకులు, పరుగుల మీద వచ్చి, కొందరినైనా కాపాడారు. సూళ్లూరు పేట తెలుగు నాయకుడు శ్రీ వేనాటి చంద్రా రెడ్డి ప్రశంస నీయమైన సేవ చేశారు. ఎటు చూసినా రక్తపు మడుగులు, తెగిపడిన మాంస ఖండాల జుగుప్సాకర సన్నివేశాలు, బాధితుల హాహాకారాలు, బాధతో వేసే కేకలతో హృదయ విదారకంగా వుండిన ఆ సన్నివేశంలో పని చేయాలంటే ఎంత కష్టమో ఆలోచించుకోవచ్చు.

నేషనల్ హైవే దౌర్భాగ్య స్థితికి, పాలకుల అలక్ష్య వైఖరికి ప్రజలు చెల్లిస్తున్న మూల్యం ఇది. రోడ్డును వెడల్పు చేసి, వాహనాలు ఎదురెదురు పడకుండా డివైడర్లు ఏర్పాటు చేస్తేనే ఈ ఘోరాలు నివారింప బడతాయి. అందుకు ఎన్ని దశాబ్దాల సమయం పడుతుందో, ఇంకెన్ని వేల ప్రాణాలు ఆహుతి కావలసి వుందో వూహాకందని విషయం.

## సినిమా

17 పేజీ కొరవ

అంతస్తు ఉంది. తెలుగు ఫీల్డులో శీఘ్రగతిన చొచ్చుక పోయాను. రమ్యకృష్ణ నన్ను విష్ చేయక పోవడానికి అదే కారణమేమో. అది నేనం పట్టించుకోను. అంతకన్నా గట్టిదాన్ని. ఆమెను చూసి చూడనట్లు పోతాను. అంతే, దీన్ని పలువురు పలు రకాలుగా భావిస్తారు" అంది నగ్మా.

### "సవ్యసాచి"

ఎ.ఎన్.ఆర్, దాసరి నారాయణ రావులతో జొన్నాద రమణ మూర్తి "సవ్యసాచి" అనే చిత్రం నిర్మించ నున్నారు. దర్శకత్వం: రవిరాజ పినిశెట్టి.

# అశ్రుతర్పణం



నిర్భయుడు, నిష్కల్మష హృదయుడు, నిష్కపటి
నెల్లూరు జిల్లాలో విద్యావ్యాప్తికి విశేషంగా
కృషి చేసి ఎన్నో విద్యా సంస్థల ఆవిర్భావానికి కారకులైన

# శ్రీ ఆనం వెంకటరెడ్డి గారు

స్వర్గస్థులైనందుకు చింతిస్తూ, వారి పవిత్ర ఆత్మకు చిరశాంతిని
కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ, వారి కుటుంబానికి
మా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము.

ప్రిన్సిపల్, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బంది

## వి.ఆర్. కాలేజి, నెల్లూరు

## జనవాణి

3 పేజీ కొరవ

పోయిన ప్రతిభాశాలి శ్రీ ఏనుగ శ్రీనివాసులు రెడ్డి. ఆయన నెల్లూరు వారు కావడం జిల్లాకు గర్వకారణం. నల్లవారి ఆత్మ గౌరవ సాంస్కృతిక విప్లవాన్ని పరివ్యాప్తం చేసిన ఘనాపాటికి దక్షిణాఫ్రికా ప్రజలు జేజేలు పల్కి సన్మానించడం ఆనంద దాయకం. నేను బుచ్చిరెడ్డి పాళెం సమితిలో పి.ఆర్.ఒ.గా పని చేస్తున్నప్పుడు 1968 ప్రాంతంలో వారిని కలిసే అదృష్టం లభించింది. ఆ రోజు సమాచార శాఖ సంచాలకులు శ్రీమతి రాజ్యం సిన్హా గారు బుచ్చి సమీపంలోని ఇస్కపాళెంలో రేడియో గోష్ఠి సంఘాన్ని చూడడానికి వచ్చారు. విజిట్ అనంతరం సాహితీ మిత్రుడు వాకాటి పెంచల రెడ్డి, యువ కర్షకుడు ఏనుగ ఇంద్రసేనా రెడ్డి స్వగృహంలో సెలవు మీద వచ్చి వున్న శ్రీ ఏనుగ శ్రీనివాసులు రెడ్డి గారిని కలవడం తటస్థించింది. శ్రీమతి సిన్హా గారి నుండి సమాచార శాఖ వివరాలను ఎంతో ఆసక్తితో తెలుసు కున్నారు. ఐక్యరాజ్య సమితి ఉన్నత పదవిలో ఉన్నా ఆయన ఎంతో నిరాడంబరంగా కనిపించారు. మాటల్లో వినయం, సంస్కారం వుట్టిపడినాయి. ఏసి రూముల్లో, మరెన్నో ఆధునిక వసతులకు అలవాటు పడిన వ్యక్తి ఒక పల్లెటూరి భవంతిలో ఇమిడి పోవడం మమ్మల్ని ఆశ్చర్య పరిచింది. శ్రీ రెడ్డి సేవలు మరింతగా ప్రపంచ శాంతికి దోహద పడాలని మనం కోరుకుందాం.

విశాఖపట్నం -ఎం. రామ్మూర్తి

### రైల్వే స్టేషన్ వరకు టౌన్ బస్సులు నడపాలి!

నెల్లూరు టౌన్‌లోని రైల్వే స్టేషన్‌కు ఒక్క టౌన్ బస్సు కూడా లేదంటే వివి పొరుగు జిల్లాల వారు నవ్వి పోవచ్చు. బస్సులు లేక పోవడం వల్ల ఆటోలు, రిక్షాల వారు అడిగే ధార్జికి ప్రజలు పడరానిపాట్లు పడుతున్నారు. కాని రవాణా శాఖాధి కారులకు, ఆర్టీసి అధికారులకు మాత్రం జాలి మాత్రం కల్గడం లేదు. ప్రస్తుతం బోసు బొమ్మల వరకు వచ్చే టౌన్ బస్సులను రైల్వే స్టేషన్ వరకు పొడిగించి నడపవచ్చు. రైల్వే స్టేషన్ నుండి అమెరికన్ ఆసుపత్రి, రంగ నాయకుల పేట, సంతపేట, సెంట్ జోసఫ్ ఆసుపత్రి, బోసు బొమ్మ మీదుగా కొన్ని బస్సులైనా నడిపితే ప్రజలు సంతోషిస్తారు. ముఖ్యంగా వివిధ రైళ్లు వచ్చే సమయాల్లో కొన్ని బస్సులను స్టేషన్ వరకు నడపాలి. కలెక్షన్ కూడా బాగుంటుంది. ఈ విషయంలో యువకుడైన ఆర్టీవో శ్రద్ధ తీసుకుంటే ప్రజల మన్ననలు పొందుతారు.

నెల్లూరు -వి. విజయకుమార్‌రెడ్డి

### గూడూరులో కోతుల బెడద

చాలా కాలంగా గూడూరు టౌన్‌లో కోతుల బెడద ఎక్కువగా వుంది. తూర్పు వీధిలో ఈ సమస్య మరీ తీవ్రం. ఇళ్లలో దూరి వస్తువులు ఎత్తుక పోతున్నాయి. చెట్లను ధ్వంసం చేసి, బెంకాయి చెట్ల మోము ఆదిలోనే ధ్వంసం చేస్తున్నాయి. చేతి గడియారాలు, కళ్ల అద్దాలు ఎత్తుక వెళ్లి ఎక్కడో పార వేస్తున్నాయి. మునిసిపల్ కమీషనర్‌కు అర్జీలు ఇచ్చినా ప్రయోజనం లేకుండా పోయింది. కొత్త ఛైర్మన్, మునిసిపల్ కౌన్సిలర్లు శ్రద్ధ వహించి కోతుల పని పడితే ప్రజలు సంతోషిస్తారు.

గూడూరు -ఆవుల కొండయ్య

### గూడూరు మునిసిపాలిటి పన్నులు తగ్గించాలి!

గూడూరు పట్టణాన్ని సుందర, నందన వనంలా తీర్చి దిద్దుతారని ప్రజలు గుడ్డిగా నమ్మి తెలుగు దేశం పార్టీ అభ్యర్థిని ఛైర్మన్ చేయడంతో పాటు అత్యధిక వార్డుల కౌన్సిలర్లుగా ఆ పార్టీ వారినే గెలిపించారు. కాని ప్రజల ఆశలు నిరాశ అయ్యాయి. కొత్త కౌన్సిల్ అభివృద్ధి పనులను నామ మాత్రమైనా మొదలు పెట్టకుండా, మునిసిపల్ పన్నులను మాత్రం విపరీతంగా పెంచి ప్రజలకు మహోపకారం చేసి పెట్టింది. అన్ని ప్రాంతాలనూ ఒకే పరిధిగా చేసి తాటాకు పందిళ్లకు కూడా 120 రూపాయల లెక్కన పన్నులు విధించారు. సామాన్యులు ఈ పెంపుదలకు అల్లాడి పోతున్నారు. కౌన్సిల్ తమ నిర్ణయాన్ని ఒకసారి సమీక్షించు కొంటే మంచిది.

గూడూరు -కె.వి. రమణ

### వెంకటరెడ్డికి నివాళి!

నెల్లూరు జిల్లా రాజకీయాలను ఎవరైనా అవలోకిస్తే ఆనం వారి పేరు ముందు వినబడుతుంది. ఆ కుటుంబంలో కురు వృద్ధులు వెంకట రెడ్డి గారితో కలుపుకొంటే ఆ కుటుంబంలోని నలుగురు పెద్దలు కన్ను మూశారు. శేషారెడ్డి, రంగారెడ్డి, ఎసి సుబ్బారెడ్డి గార్లు - చివరన వెంకట రెడ్డి గార్లు పరమ పదించారు. ఏ విషయానికి వెంకట రెడ్డి వెనుకాడే వారు కాదు. మరణా నంతరం తన కళ్లను కూడా దానం చేసి వెంకట రెడ్డి ధన్యజీవి. వారి కుటుంబానికి హృదయ పూర్వక సానుభూతి తెలియ జేస్తున్నాను.

నెల్లూరు -జె.పోలిరెడ్డి

## నెల్లూరు సంగతులు

15 పేజీ కొరవ

నెల్లూరు శివం హోటల్‌లో నాయుడమ్మ సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ఆల్టర్నేటివ్స్ సంస్థ నిర్వహించిన సభలో ఆయన స్మారకో పన్యాసం చేశారు. ఎప్పటికీ తరగని, కాలుష్యం లేని, ప్రకృతిలో లభ్యమయ్యే సంప్రదాయ ఇంధన వనరులను; ముఖ్యంగా గ్రామ ప్రాంతాలలో ఉపయోగించడం వల్ల నాయుడమ్మ కృషి చేసిన సైన్స్ ద్వారా గ్రామీణాభివృద్ధి ఆశయాలను సాధించ వచ్చుని సెలవిచ్చారు. గాలి మరలతో విద్యుత్ ఉత్పాదనను పెద్ద ఎత్తున పెంచేందుకు పథకాలు రూపొందించ బడ్డాయని, వీటి వల్ల 20 వేల మెగా వాట్ల ఉత్పత్తి సాధ్యమని నిపుణులు అంచనా వేసినట్లు చెప్పారు. ప్రత్యామ్నాయ ఇంధన వనరులను గ్రామ ప్రాంతాల్లో వినియోగించు కొన్నప్పుడే ప్రయోజనం చేకూరు తుందన్నారు. కేంద్ర చర్మ పరిశోధనా సంస్థ మద్రాస్ డైరెక్టర్ డాక్టర్ కె.వి. రాఘవన్, సి.ఎల్. ఆర్ మాజీ డిప్యూటి డైరెక్టర్ శ్రీ. శేషగిరి రావు, పారిశ్రామికవేత్త ఎమ్.టి. కృష్ణారెడ్డి కూడా మాట్లాడారు. 1995 నాయుడమ్మ అవార్డును డాక్టర్ కె.వి. రాఘవన్, డాక్టర్ భక్తవత్సలంలకు ప్రదానం చేశారు. సంస్థ కన్వీనర్ డాక్టర్ ఎ. జగదీష్ తొలుత స్వాగతం చెప్పి చివరన వందనాలు చెల్లించారు.

### పాఠశాలలన్నీ 12 తేది తీస్తారు!

వేసవి సెలవుల అనంతరం జిల్లాలోని పాఠశాలలన్నీ 12 తేది పునః ప్రారంభ మవుతాయి. వివిధ యాజమాన్యాల క్రింద వున్న అన్ని పాఠశాలలూ ఆ రోజు తెరుస్తారని డి.ఇ.ఓ. శ్రీ పసల భీమన్న తెలియ జేసారు.

**50 ఏళ్ళ క్రితం**

3 పేజీ కొరవ

### ఓకుదూలం

ముత్తుకూరు రేవుకు ఒక పెద్ద ఓకు దూలం కొట్టు కొచ్చిందనీ, దాన్ని ఎవరో లప్టాయిస్తే అధికార్లు కళ్లు మూసు కున్నారనీ పేరులేని ఒకరు తెలుపు తున్నారు. బ్రిటీషు ప్రభుత్వాన్ని పకడ్బందీగా పట్టుకుని నిలబెట్టి, అధికార వర్గం కళ్లు మూసకుంటే ఇక కందకులేని దురద బచ్చలికేలా?'' అన్నట్లు యీ అనామ ధేయుడికి, నాకూ ఎందుకు ఈ కంఠశోష అంటా?

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ. 50/-
విడిప్రతిరూ. 2/-

## జిల్లావార్తలు

11 పేజీ కొరవ

తీసుకుని విష్ణు జిల్లా అధికారులను అల్లూరును తీసుకు వచ్చి ప్రత్యక్షంగా రైతుల బాధలు విన్నవింప జేశారు. కలెక్టర్ గత వారంలో అరఘూట విష్ణుతో కలసి అల్లూరు చుట్టు ప్రక్కల గ్రామాలు పర్యటించి, రైతులను ఊరడించారు. రంగు మారిన ధాన్యాన్ని ఎఫ్‌సిఐ కొనేందుకు ప్రభుత్వ ఉత్తర్వు కోసం ఎదురు చూస్తున్నట్లు రైతులకు నచ్చ చెప్పారు. ఈ పర్యటన వల్ల మళ్లీ విష్ణుకు రైతుల్లో ఇమేజ్ పెరిగింది. పంచాయితీ ఎన్నికల తేదీ కూడా ప్రకటించడంతో విష్ణు అభ్యర్థులను నిర్ణయించే కార్యక్రమంతో ప్రస్తుతం బిజీగా వున్నారు. ఇటీవల కాలంలో అల్లూరు మండల ప్రజలు మంచినీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడ్డారు. నేటికీ కొన్ని గ్రామాల్లోనీటికై కటకట లాడాల్సిన పరిస్థితి వుంది. గతంలో ఎమ్మెల్యేగా వున్నప్పుడు కాంప్ర హెన్సివ్ పథకంలో భాగంగా అల్లూరు చెరువులో మినీ ట్యాంకులను నిర్మించే ప్రతిపాదనలు వెంకయ్య గారు రూపొందించారు. అది నేడు ఏ స్థితిలో వుందో తెలియదు. తనకున్న విశేష రాజకీయ పరిజ్ఞానంతో అల్లూరులో డిగ్రీ కళాశాల, ఐ.టి.ఐ. వంటి పారిశ్రామిక సంస్థల స్థాపక విషయంలో శ్రద్ధ తీసుకొని ఎమ్మెల్యేగా ఆయన ప్రజల మన్ననలు పొందడం అవసరం. లేకుంటే విష్ణు జోరు తట్టు కోవడం కూడా కష్టం.

### ఆత్మకూరు సిమెంట్ రోడ్డు పూర్తి కాదా?

ఆత్మకూరు టౌన్‌లో సిమెంటు రోడ్డు వేసేందుకు పంచాయితీ వారు 4 లక్షలా 50 వేలు మంజూరు చేసారు. కాంట్రాక్టర్ సర్పంచ్ మామ. పనిలో భాగంగా ఇరు ప్రక్కలా సైడు కాల్వలు నిర్మించాలి. టెండరు పిల్చిన రోజు సిమెంటు బస్తా ధర 85 ప్రస్తుతం 135 రూపాయలకు పెరగడంతో రోడ్డు పనులు చేయనని కాంట్రాక్టర్ మొరాయిస్తున్నాడు. సొంత మామకు ప్రజలకు మధ్య సర్పంచ్ నలిగి పోతున్నారు.

### అంబేద్కర్ విశ్వ విద్యాలయం లీల!

విద్యార్థుల జీవితాలతో చెలగాట మాడడం ఈ మధ్య విశ్వ విద్యాలయాలకు మామూలై పోయింది. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయం ఈ విషయంలో ఒకింత ముందడుగు వేసి ఒకే విద్యార్థి పాస్ అయినట్లు ఒకటి, ఫెయిల్ అయినట్లు ఇంకొకటి రెండు మార్కుల లిస్టులు పంపి తన ఘనతను చాటింది. గూడూరుకు చెందిన కె. విశ్వనాథ్ 1995 జనవరి నెలలో విశ్వ విద్యాలయం నిర్వహించిన డిగ్రీ అర్హతా పరీక్షకు హాజరయ్యాడు. ఫలితాలు ప్రకటించాక పరీక్షలో తప్పి పోయినట్లు యూనివర్శిటీ మార్కుల లిస్ట్ పంపింది. కాని మరునటి దినం అతని పేరుతోనే మరో మార్కుల లిస్ట్ పంపుతూ డిగ్రీకి ప్రవేశానికి దరఖాస్తు చేసుకోమని మెటీరియల్ కూడా జత చేసి పంపారు. విశ్వనాథ్‌కు ఏం చెయాలో పాలుపోక రెండు మార్కుల జాబితాలు పట్టుకొని విశ్వ విద్యాలయానికి ప్రయాణ మయ్యారు.

### అనాథ ప్రేతాలుగా ఆత్మకూరు కల్వర్టులు!

నెల్లూరు నుంచి ఆత్మకూరు మీదుగా సాగే జాతీయ రహదారి పై కొలగట్ల గ్రామం వద్ద కల్వర్ట్‌ల రెండు సంవత్సరాల క్రితం పగుల గొట్టారు. తిరిగి నిర్మాణపు పనిని కాంట్రాక్టర్ చేపట్టలేదు. రాబోయేది వర్షాకాలం కాబట్టి భారీ వాహనాలు ఈ చిన్న మట్టి రోడ్డు పై దిగి కూరక భాయం. ఆత్మకూరు - నెల్లూరు ట్రాఫిక్ నిలచి పోవడం తప్పదని గ్రామస్తుల ఆవేదన. రోడ్లు భవనాల శాఖ వున్నతా ధికారులు కాంట్రాక్టర్‌ను వెతికి పట్టి పనులు చేయించాలి.

### దుండిగం మాజీ కరణం మరణం!

దగదర్తి మండలం దుండిగం గ్రామానికి 30 సంవత్సరాలు కరణంగా గత నాలుగు సంవత్సరాలు వి.ఎ.ఓ.గా పని చేస్తుండిన కొల్లూరు రాధాకృష్ణ మూర్తి (59) 4 తేది మరణించారు. వరుసగా 12 సంవత్సరాల పాటు నెల్లూరు ఆర్డీవో చేత ఉత్తమ కరణం అవార్డు పొందిన ఘనుడాయన. ఇద్దరు కుమారులు,దులు, ఒక కుమార్తె వున్నారు.

### కళ్ల ముందు మందున్నా బయట కావలి!

రాపూరు ఎక్సైజ్ సిబ్బందిని కళ్లు లేని కబోదు లనవచ్చు. టౌన్‌లో, జిల్లాలోఎక్కడా లేని విధంగా ఫ్రీ మార్కెట్‌లో మందు దొరుకు తుందిక్కడ. ఇంతకు ముందు వ్యాపారం చేసిన వారు లక్షల విలువ చేసే మద్యాన్ని నింపాదిగా నిల్వ చేసుకొని అమ్ము కొంటున్నా నిలువరించే సాహసం ఎక్సైజ్ సిబ్బందికి లేదు. కాని ఊరి బయట ఏర్పాటు చేసిన చెక్‌పోస్టుల వద్ద మాత్రం వాహనాలను చెక్ చేస్తూ తెగ డ్యూటీ చేస్తున్న ఫోజులిస్తున్నారు. పగలు మాత్రమే గంటలు తరబడి వాహనాలు నిలిపి చెకింగ్ చేయుంచడం వల్ల ఏ మాత్రం ప్రయోజనం లేకుండా పోతుంది. స్మగ్లర్లు రాత్రి పూట సజావుగా తమ పని తాము చేసు కొంటున్నారు. ఇకనైనా సిబ్బంది తమ ధోరణి మార్చుకుంటే మంచిది.

### షేర్ మార్కెట్

2 పేజీ కొరవ

కంపెనీ లాభ నష్టాలతో నిమిత్తం లేకుండా మొత్తం మార్కెట్ నష్టపోతున్నది. కొత్తగా పబ్లిక్ ఇష్యూలకు వచ్చే కంపెనీల విషయంలోనూ మరింత మెళకువ అవసరం. సందేహా స్పదమైన వాటిని ఆదిలోనే నిరోధిస్తే, అనుమతి నిరాకరిస్తే మార్కెట్ బాగు పడుతుంది.

### మోర్గాన్ స్టాన్లీ

2 పేజీ కొరవ

రాబోతున్నది. 2480 కోట్ల రూపాయల వసూలు చేయబోతున్నారు.

ఐడిబిఐ పెద్ద సంస్థే; కాదనము. కానీ, వారు నిర్ణయించిన ప్రీమియంకు వారి షేర్ విలువ కల్గినది కాదు. తమ ఇపిఎస్ ప్రకారం ప్రీమియం నిర్ణయించి ప్రజల ముందుకు వస్తున్నది సంస్థ. అది సరైన విధానం కాదు. వారి ఇపిఎస్ ఇప్పుడు రు15 లు వుంది. గత సంవత్సరం స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా పబ్లిక్ ఇష్యూ ప్రీమియం తమ షేర్ బుక్ వాల్యూ ప్రకారం నిర్ణయించారు. అది సమంజసమైన పద్ధతి. ఐడిబిఐ ఆ విధానం పాటించలేదు. అందువల్లే దాని ప్రీమియం, దాని విలువ కంటే అధికంగా వుంది.

మినిమం సబ్ స్క్రిప్షన్ రాకుంటే నిధులు వాపసు చేయాలన్న నిబంధన నుంచి ఐడిబిఐని మినహాయించారు. తమ ఇష్యూ పట్ల తమకే నమ్మకం లేక ఐడిబిఐ ఈ మినహాయింపు కోరినట్లుంది.

దీని పై పెట్టుబడి పెట్టడం అనవసరం.


జమీన్‌రైతు

| | |
|---|---|
| సంవత్సరచందా | రూ. 100/- |
| అర్థసంవత్సర చందా | రూ.50/- |

విడిప్రతిరూ. 2/-

# నెల్లూరు పట్టణంలో అధునాతన మూత్రపిండ వ్యాధుల ఆసుపత్రి

## ఈ రోజు 9.6.95 ఉదయం 10 గంటలకు ప్రారంభమైనది





**HOSPITAL**

**SUSRUTHA URO RENAL HOSPITAL • POGATHOTA • NELLORE**

### మా హాస్పిటల్ ప్రత్యేకతలు

- మూత్రపిండ, మూత్రావయవ వ్యాధులకు అధునాతన యంత్ర పరికరములతో రోగనిర్ధారణ- చికిత్సకు అవసరమైన అధునాతన పద్ధతులు-ఇన్ని సౌకర్యములు మా హాస్పిటల్‌లో పొందుపరచబడినవి.
- ప్రోస్టేట్ గ్రంధి మరియు మూత్రకోశమునకు సంబంధించిన వ్యాధులకు ``ఎండోస్కోపి" ఆపరేషన్లు చేయబడును. TURP - TURBT
- మూత్రపిండాలలోనూ - మూత్రావయవములలోను ఏర్పడేరాళ్ళను శస్త్రచికిత్సతో నిమిత్తం లేకుండా తొలగించబడును. (Uretero Renoscopy నుండి PCNL)
- మూత్రనాళముల మరియు మూత్రకోశ వ్యాధుల రోగ నిర్ధారణకు సిస్టోస్కోపి (Cystoscopy)
- పురుషులలో ఏర్పడే నపుంసకత్వము పోగొట్టుటకు మైక్రో సర్జరీ - రీకేనలైజేషన్ఆపరేషన్లు చేయబడును.సంతానలేమికి ప్రత్యేక చికిత్స.
- స్త్రీలలో వచ్చే మూత్రవ్యాధులకు - సంతానం లేని వారికి ప్రత్యేక చికిత్సా విభాగము కలదు. (Female Urology)
- చిన్నపిల్లలకు పుట్టుకతో వచ్చు అన్ని మూత్ర వ్యాధులకు శస్త్ర చికిత్స చేయబడును.
- అత్యవసరకేసులు అన్ని వేళలందు చికిత్స చేయుటకు మా హాస్పిటల్‌లో అత్యవసర విభాగము కలదు.

**డా. ఎం. మోహన్‌రాజు,**
M.S., M.Ch., (Uro)

---

ESTD: 1988 PHONE: 25199

*Dr. Sarvepalli Radhakrishnan*

# SCHOOL OF SECONDARY EDUCATION

**(Dr. S.R.K. SCHOOL)**

SOMASEKHARAPURAM, BEHIND JAYABHARAT HOSPITAL, NELLORE - 524 003.

## S.S.C. RESULTS 1994 -95 -- Vth BATCH -- ALL FIRST CLASSES

BHARGAV, No. 870130, I CLASS
M. KIRANMAYEE, R.No. 870131, I CLASS
K. MADHUMATHI, R.No. 870132, I CLASS
D. ROOPA, R.No. 870133, I CLASS
M. REVATHI, R.No. 870135, I CLASS
M. SUNEETHA, R.No. 870135, I CLASS
V. CHAITANYA, R.No. 870136, I CLASS
B. KALYAN, R.No. 870137, I CLASS
K.V.S.N. KARTHIK, R.No. 870138, I CLASS
B. MANJUNADH, R.No. 870139, I CLASS
N.V. NAGENDRA, R.No. 870140, I CLASS
V. RAJESH, R.No. 870141, I CLASS
Ch. RAJESH, R.No. 870142, I CLASS
C.V. RAGHAVENDRA, R.No. 870143, I CLASS
I CLASS

No. 870145, I CLASS
I. SUJITH KUMAR, R.No. 870146, I CLASS
V.V. SATYANARAYANA, R.No. 870147, I CLASS
G. VARUN, R.No. 870149, I CLASS
T. PRATHIMA, R.No. 870159, I CLASS
I. RASHMITHA, R.No. 870160, I CLASS
D. SWETHA, R.No. 870161, I CLASS
K. VEENA MADHURI, R.No. 870162, I CLASS
D. ANILKUMAR, R.No. 870163, I CLASS
T. MALLIKARJUNA, R.No. 870164, I CLASS
M. RAJESH KUMAR, R.No. 870165, I CLASS
P. SATISHKUMAR, R.No. 870166, I CLASS
C. VIVEKANANDA, R.No. 870167, I CLASS
P. YUGANDHAR, R.No. 870168, I CLASS
I CLASS

| Year | Appeared | Results | Average Percentage of Marks |
|---|---|---|---|
| 1990 - 91 | 19 | 100% First Classes | 72.4 |
| 1991 - 92 | 29 | 100% First Classes | 70.55 |
| 1992 - 93 | 21 | 100% First Classes | 75.02 |
| 1993 - 94 | 30 | 100% First Classes | 80.02 |
| **1994 - 95** | **30** | **100% First Classes** | **Expecting 80% and above** |

అన్ని First Classes మామూలే- 80% Average Percentage సాధించడం ఇప్పుడు అవసరం ర్యాంకులతో పాటు అందరు విద్యార్థులు ఎక్కువ శాతం మార్కులు సాధించడం నేడు చాలా కష్టం.
అది సాధించడమే మా ప్రత్యేకత

**School Reopens on 12.6.1995**
**Admissions Commenced for 1995 - 96**

**Convent లో చదివిన Graduates, Post - Graduates మాత్రం Teacher Post కొరకు జూన్ 15వ తేది లోగా నేరుగా సంప్రదించండి.**

## ADMISSIONS FOR 1995 - '96

- Play Class to Xth Class లకు అడ్మిషన్లు స్వీకరించబడును.
- మా స్కూలు నుంచి వెళ్ళిన 5 బ్యాచిల్లో వున్న 130 మంది Ist Class లతో పాసైనారు. 75 శాతం అంతకన్నా ఎక్కువ మార్కులతో ఎక్కువ మంది పాస్ కావడం మా ప్రత్యేకత.
- ప్రతి క్లాసులోను విద్యార్థుల సంఖ్య 30కి పరిమితం. దాదాపు అందరు టీచర్లు B.Ed., పూర్తి చేసిన పోస్టు గ్రాడుయేట్స్ మరియు కాన్వెంటులో చదివిన గ్రాడుయేట్స్.
- 500 మార్కులు పైగా సంపాదించిన 24 మంది విద్యార్థులు National Merit Scholarships పొందిరి.
- Quiz మరియు Eloquision పోటీలలో మా విద్యార్థులు రాష్ట్ర స్థాయిలో కూడా బహుమతులను పొందినారు. జిల్లా స్థాయిలోనూ మా విద్యార్థులు ప్రతి సంవత్సరం ఎన్నో బహుమతులను పొందుట సర్వసాధారణమైన విషయమని అందరికి తెలిసినదే.
- మా విద్యాబోధనను పిల్లలను కొట్టి, హింసించి, బాధపెట్టే పద్ధతులలో కాక వారికి మానసిక వికాసము కలిగించి తద్వారా ప్రతి విద్యార్థి ఇంటి వద్ద 2 గంటలు చదివేటట్లు చేయుట.
- చిన్న తరగతుల పిల్లలకు ప్రత్యేకమైన బోధనను. ప్రత్యేకించి KG పిల్లలకు వారి వికాసమునకు కావలసిన విద్యా పరికరాలు ఏర్పాటు చేయబడినవి.
- ప్రవేశ పరీక్షలు జూన్ నెల 11వ తేదీ నుంచి నిర్వహించబడును. ఈ పరీక్షలలో కనీసం 40 శాతం మార్కులు వచ్చిన వారికి మాత్రమే ప్రవేశము ఇవ్వబడును.

**P. Krishna Murthy,** M.Com.
Director